

# చందమామ

సెప్టెంబర్ 1994



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 4.00

సంవత్సర చందా : 48.00

# వనిత

సెప్టెంబర్ 1994

రూ. 8/-



కిరణ్‌బేడితో గోష్ఠి



లక్ష్మీపార్వతితో గోష్ఠి

చేతిపనులు +
గృహాలంకరణ
విశేష సంచిక




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## అందరికీ ఆరోగ్యం - పాఠశాలల బాధ్యత!



ఆరోగ్యమే మహాభాగ్యం అన్న సూక్తి అందరూ ఎరిగినదే. మనిషి ఆరోగ్యం కేవలం వ్యక్తిగత విషయంగానే కాకుండా సామాజిక విషయంగా కూడా ఇవాళ గుర్తింపు పొందింది. ఆరోగ్యకరమైన వ్యక్తి, కుటుంబ క్షేమానికీ, దేశ సౌభాగ్యానికీ మూలాధార శక్తి అన్న సత్యాన్ని గుర్తించడం వల్లే ఈనాడు ప్రతి దేశం తన దేశ ప్రజల ఆరోగ్య పరిరక్షణ కోసం తగిన చర్యలు తీసుకుంటున్నది. తత్ఫలితంగానే క్రమంగా వ్యాధులు తగ్గి, మనిషి ఆయుఃప్రమాణం పెరుగుతున్నది.

అనారోగ్యానికి పోషకాహారలోపంతో పాటు ముఖ్యంగా మూడు కారణాలు చెప్పవచ్చు. అవి : తాగే నీటి కాలుష్యం; పీల్చే గాలి కాలుష్యం; అపరిశుభ్రత. వ్యక్తిగత పరిశుభ్రతను గురించి చిన్నప్పటినుంచే విద్యార్థులకు బోధించడం చాలా అవసరం. విద్యార్థులకు విద్యతో పాటు పరిశుభ్రతను గురించీ, ఆరోగ్య సూత్రాలను గురించీ పాఠశాలలలో బోధించాలి. బోధించిన సూత్రాలను సక్రమంగా పాటిస్తున్నారా అని ఉపాధ్యాయులు రోజూ విద్యార్థులను పర్యవేక్షించాలి.

ఉపాధ్యాయులూ, విద్యార్థులూ కలిసి తల్లిదండ్రులకూ, ఇతరులకూ పరిశుభ్రతను గురించి తెలియజెప్పాలి. అలా చేసినప్పుడు అందరికీ ఆరోగ్యం అన్న మన లక్ష్యాన్ని త్వరగా చేరుకోగలం.

సంపుటి : 96 సెప్టెంబర్ '94 సంచిక : 3

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00



మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, అటు పరిశ్రమలోనూ,
ఇటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

చిత్ర మాసపత్రిక

# విజయచిత్ర




ఇది ఒక డాల్టన్ ప్రచురణ

వార్తలు - విశేషాలు:

# పశ్చిమ ఆసియాలో శాంతికి మరొక ఒప్పందం!



ఆగస్టు 3వ తేదీ జోర్డానియా విమానం పొరుగు దేశమైన ఇజ్రాయెల్ మీద స్వేచ్ఛగా ఎగిరింది. ఇందులో విశేషమేమిటని అంటారా? ఆ విమానాన్ని జోర్డానియా రాజు హుస్సేన్ ఇబిన్ తలాల్ స్వయంగా నడిపాడు. ఇందులో మాత్రం వింత ఏమిటి అని అనుకుంటున్నారా? కాని ఇందులో గొప్ప విశేషమే వుంది. ఎందుకంటే జూలై 25వ తేదీకి పూర్వం అలా పయనించే అవకాశం జోర్డాన్ రాజుకు లేదు. ఆరోజే జోర్డాన్ రాజూ, ఇజ్రాయెల్ ప్రధాన మంత్రి ఇషాక్ రాబిన్ చారిత్రాత్మకమైన ఒప్పందంలో సంతకాలు చేశారు. ఆ ఒప్పందం వాషింగ్టన్, వైట్ హౌస్ 'రోజ్ గార్డెన్'లో జరిగింది. అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ ఆ ఒప్పందాన్ని 'వాషింగ్టన్ డిక్లరేషన్'గా ప్రకటించి అందులో సాక్షి సంతకం పెట్టాడు.

ఇటీవల రోజ్‌గార్డెన్‌లో జరిగిన రెండవ ఒప్పందం ఇది. మొదటి ఒప్పందం గత సెప్టెంబర్ 3వ తేదీ ఇజ్రాయెల్ ప్రధాని రాబిన్, పాలస్తీనా విమోచన సంస్థ నాయకుడు యాసర్ అరాఫత్ మధ్య జరిగింది. బిల్ క్లింటన్ సమక్షంలో జరిగిన ఆ ఒప్పందంపై సంతకాలు చేసి ఇరువురూ కరచాలనం చేసుకుని నలభై యేళ్ళ శత్రుత్వానికి అంతం పలికారు.

ఇప్పుడు హుస్సేన్, రాబిన్‌లు 'వాషింగ్టన్ డిక్లరేషన్' అనే ఒప్పందంపై సంతకాలు చేసి, ఉభయ దేశాల మధ్య 1948వ సం॥ నుంచి సాగిన ఘర్షణలను ఆపారు. జోర్డాన్ రాజు విమానం ఇజ్రాయెల్‌లో ప్రవేశించి, రాజధాని టెల్ అవివ్‌నూ, జెరూసలెం నగరాన్నీ చుట్టిరావడంతో ఇది రుజువయింది. ఇన్నాళ్ళ తరవాత ఇజ్రాయెల్‌లో ప్రవేశించిన మొట్టమొదటి జోర్డాన్ విమానం ఇదే కాబట్టి 'వాషింగ్టన్ డిక్లరేషన్'లాగా దీనిని కూడా చిరస్మరణీయమైన సంఘటనగా చెప్పవచ్చు.

సుదీర్ఘకాలం కొనసాగిన పగనూ, ఘర్షణలనూ మరిచి, ఉభయ దేశాలు మిత్ర దేశాలుగా మారడానికి దారితీసిన పరిస్థితులను తెలుసుకోవాలంటే గత చరిత్రను క్లుప్తంగా పరిశీలించాలి.

జోర్డాన్ నదీ తీరంలో సారవంతమైన భూములు ఏర్పడటంతో క్రీ.పూ. 4000 సంవత్సరాల నాడే ప్రజలు అక్కడ చేరి నివాసాలు ఏర్పరచుకున్నారు. క్రీ.పూ. 64వ సంవత్సరంలో ఇప్పటి జోర్డాన్ ప్రాంతం ఆనాటి రోమన్ సామ్రాజ్యం కిందికి వచ్చింది. క్రీ.శ. 7వ శతాబ్దంలో అది అరబ్బుల అధికారంలోకి మారింది. 1096-99 మధ్య కాలంలో ఈ ప్రాంతాన్ని యూరప్‌కు చెందిన

క్రైస్తవులు పట్టుకున్నారు. 16వ శతాబ్దంలో అది టర్కుల వశమై మొదటి ప్రపంచ యుద్ధం (1914-18) వరకు ఓటమాన్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. అరబ్బులు స్వాతంత్ర్యం కోరి టర్కుల అధికారానికి ఎదురుతిరిగారు. ఆ పోరాటంలో బ్రిటిష్ సేనలు అరబ్బులకు సాయపడ్డాయి. అందువల్ల ట్రాన్స్‌జోర్డాన్ అనే రాజ్యం ఏర్పాటుచేసి రక్షణ అధికారం బ్రిటన్‌కు అప్పగించడం జరిగింది. ముప్ఫైయేళ్ళ బ్రిటిష్ పాలన అనంతరం 1946వ సం॥లో ట్రాన్స్‌జోర్డాన్ సంపూర్ణ స్వాతంత్ర్యం పొంది రాచరిక వ్యవస్థ అమలులోకి వచ్చింది. హేష్మైట్ అబ్దుల్లా రాజై 1949వ సం॥లో రాజ్యానికి హేష్మైట్ జోర్డాన్ అని పేరు పెట్టాడు. 1953వ సం॥లో హుస్సేన్ రాజయినప్పుడు ఆయన వయసు 17 సంవత్సరాలే. సుదీర్ఘ కాలం అధికారంలో వున్న అరబ్ నేత ఆయన!




ఇజ్రాయెల్ రాజ్యం ఏర్పడిన తరవాత, వారికి అరబ్‌లతో ఘర్షణలు ఆరంభమయ్యాయి. ఇజ్రాయెల్ వశంలో వున్న జోర్డాన్ నది పశ్చిమ తీరాన్ని అరబ్‌లు ఆక్రమించారు. ఇరవై సంవత్సరాల తరవాత 1967వ సం॥లో జరిగిన 'ఆరు రోజుల యుద్ధం'లో ఇజ్రాయెల్ మళ్ళీ ఆ ప్రాంతాన్ని పట్టుకున్నది. 1988వ సం॥లో హుస్సేన్ రాజు జోర్డాన్ పశ్చిమ తీర అధికార బాధ్యతలను పాలస్తీనియన్లకు అప్పగించాడు. పాలస్తీనా విమోచన సంస్థ, పాలస్తీనా ప్రాంతానికి స్వతంత్రం ప్రకటించుకోవడానికి ఇది దోహదం చేసింది.

46 సంవత్సరాల శత్రుత్వం వదిలిపెట్టి, సుస్థిరమైన శాంతి కోసం కృషి చేయాలని జోర్డాన్, ఇజ్రాయెల్ దేశాలు 'వాషింగ్టన్ డిక్లరేషన్'లో అంగీకరించాయి. హుస్సేన్ విమానం ఆకాశంలో ఎగురుతున్నప్పుడే ఉభయ దేశాల ప్రజలు ఆనందోత్సాహాలతో రెండు దేశాల మధ్య వున్న ఇనుప కంచెను తొలగించారు. ఇజ్రాయెల్ ప్రధాని రాబిన్, హుస్సేన్‌ను తన దేశానికి ఆహ్వానించాడు. ఆయన దానిని సంతోషంగా అంగీకరించాడు.



# రోగి - చికిత్స

పేరిశాస్త్రి అనే పండితుడు రాజాస్థానానికి వెళ్ళి వాదోపవాదాల్లో అక్కడి పండితులందరినీ ఓడించి ఘనసత్కారాలు, విశేషమైన బహుమానాలు పొందాడు. మహారాజు ఆయనతో, "పండితోత్తమా! మా దేశంలో చంద్రపురమనే పట్టణమున్నది. అక్కడ ప్రజలు అన్ని రంగాల్లోనూ అభివృద్ధిని సాధించారు. కానీ, వారిలో స్వార్థచింతన ఎక్కువయినట్లు నాకు సమాచారమందింది. అక్కడి ప్రముఖులెవరూ రాజధానికి రారు. తమ సమస్యలను రాజుకు విన్నవించుకోరు. అన్నింటికీ తమలో తామే పరిష్కారమార్గాలు వెతుక్కుంటారు. దేశంలోని ఇతర పట్టాణాల్లో వున్నట్లు అక్కడ దేవాలయాలూ లేవు. దైవభక్తులూ లేరు. తమరు వారిలో చైతన్యాన్ని కలిగించవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

పేరిశాస్త్రి చంద్రపురానికి బయల్దేరి వెళ్ళాడు. రాజు పంపగా వచ్చినందుకు పట్టణంపెద్ద ఆయనను ఆర్భాటంగా ఆహ్వానించి వసతి సదుపాయాలు సమకూర్చాడు. పేరిశాస్త్రి పట్టణంపెద్దకు తన గురించి చెప్పుకుని, "నా ప్రతిభ కారణంగా రాజుకు నేనంటే మితిమీరిన గౌరవం. మీకే పనికావాలన్నా నా ద్వారా వస్తే సులువుగా అయిపోతుంది," అన్నాడు.

"తమరు వచ్చిన పని చెప్పండి," అన్నాడు పట్టణంపెద్ద.

"మీకు దైవభక్తి ప్రాముఖ్యతను గురించి చెప్పాలనుకుంటున్నాను. ఎక్కడైనా పెద్ద సభ ఏర్పాటు చేయించండి," అన్నాడు పేరిశాస్త్రి.

పట్టణంపెద్ద, సభను ఏర్పాటు చేయగా జనం తండోపతండాలుగా వచ్చారు. పేరిశాస్త్రి దేవుడి గురించి అనర్గళంగా ఉపన్యసించాడు. సభికులు వెలిబుచ్చిన సందేహాలకు తృప్తికరంగాసమాధానాలిచ్చాడు. ఆయన మాటలు

"వసుంధర"

విన్నాక అందరికీ, పట్టణంలో ఒక దేవాలయం కూడాలేకపోవడం పెద్ద లోపమేననిపించింది.

మొదటి రోజు సభ ముగిశాక పేరిశాస్త్రి వద్దకు వృద్ధుడొకడు వచ్చి, "బాబూ! నువ్వు మాట్లాడుతున్నంత సేపు నిన్నే గమనిస్తున్నాను. అదొకరకంగా కణతలు చిట్లిస్తూ అప్పుడప్పుడూ కణతలు నొక్కుకున్నావు. ఇవి శిరో వేదనకు లక్షణాలు," అంటూ ఒక చిన్న సీసా ఇచ్చి, "ఇందులోని ద్రవాన్ని ప్రతిరోజూ ఉదయం,రాత్రి రెండు చుక్కలు నోట్లో వేసుకునిచప్పరించు.నీజబ్బు త్వరలో మాయమవుతుంది," అని చెప్పి, అక్కడి నుంచి బయలుదేరబోయారు.

"తాతగారూ! మీ అభిమానానికి చాలా సంతోషం. మీకేమైనా తీరని కోరికలుంటే చెప్పండి. రాజు చేత తీర్పిస్తాను," అన్నాడు పేరిశాస్త్రి.

వృద్ధుడు, పేరిశాస్త్రి వంక ఎగాదిగా చూసి అదోలా నవ్వి వెళ్ళిపోయాడు.

కొందరు పట్టణ వాసులు పేరిశాస్త్రికి తమ కోర్కెలు విన్నవించుకున్నారు. చాలా మందికి కోర్కెలు తీర్చగలనని ఆయన వాగ్దానం చేశాడు.

ఆ తర్వాత రెండు రోజులకు పేరిశాస్త్రి రాజవీధిన నడుస్తూండగా, వృద్ధుడు ఎదురై, "అదేమిటి, నాయనా! ఎండ మండిపోతూంటే గొడుగు లేకుండా తిరుగు తున్నావు. అసలే నీకు శిరోవేదన!" అంటూ బలవంతంగా తన గొడుగు ఇచ్చి వెళ్ళిపోయాడు. ఇది పేరిశాస్త్రికి చాలా వింత అనిపించింది.



వారం రోజులు గడిచాక పట్టణవాసులు దేవాలయనిర్మాణంజరగడానికిఒప్పుకున్నారు. పునాదిరాయి రాజుగారి చేతి మీదుగా పడాలనీ, ఆసమయంలో పేరిశాస్త్రి ఉపన్యసించాలనీ కూడావారుకోరారు.అన్నింటికీ పేరిశాస్త్రి తలూపాడు. ఎందరికో తానిచ్చిన వాగ్దానాల వివరాల పత్రాలను జాగ్రత్తగా పెట్టెలో సర్దాడు.

రాజు ఏర్పాటుచేసిన రథం మీద పేరిశాస్త్రి తిరుగు ప్రయాణమవుతూండగా, వృద్ధుడాయనను సమీపించి, "నాయనా! ప్రయాణంలో అలసట అనిపించినప్పుడు, ఈ ఉసిరికాయలు చప్పరిస్తూండు. నీకు సుఖంగా వుంటుంది. వీటిని ప్రత్యేకమైన ద్రావకంలో నానబెట్టి తయారుచేశాను,"అంటూ ఒక చిన్న జాడీ ఇచ్చాడు.

ఇందుకు పేరిశాస్త్రి ఎంతో సంతోషించి, ఆయన్ను ఏంకావాలో కోరుకోమన్నాడు. కానీ వృద్ధుడు మాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

అప్పుడు పేరిశాస్త్రి పట్టణంపెద్ద వైపు చూసి, "అయ్యా! ఈ వృద్ధుడికి నా గురించి బాగా తెలిసివుండాలి. నా వల్ల ఈయనకు పెద్ద సాయం అవసరమై వుండి వుండాలి. అందుకే, ఎన్నో మార్లు నా మెప్పు పొందాలని చూశాడు. కానీ ఇంతవరకూ ఒక్కసారికూడా తన అవసరమేమిటో నోరు విప్పి చెప్పలేదు. ఇది నాకు అసంతృప్తి కలిగిస్తున్నది. అవసరంలోవున్న వారిని అడిగి మరీ ఆదుకునే తత్వం నాది. మీలో ఎవరైనా ఆయనను అడిగి, మొహమాటపడకుండాతన అవసరం ఏమిటో





కుండా వుండగలనా?" అన్నాడు పేరిశాస్త్రి. వెంటనే పట్టణంపెద్ద, "ఆయనకు మీ నుంచి ఏ అవసరమూ లేదు," అన్నాడు.

" ఆ సంగతి మీకెలా తెలుసు?" అని అడిగాడు పేరిశాస్త్రి ఆశ్చర్యంగా.

"ఆయన ఈ చంద్రపురంలో మహాజ్ఞాని. ఏ శాస్త్రంలో అయినా ఆయనకు తెలియని విశేషం లేదు. వాదోపవాదాల్లో ఆయనతో నెగ్గగలవారు లేరు. ఈ పట్టణవాసులందరికీ ఆయన మాట వేదవాక్కు. ఆయన కారణం గానే మాకిక్కడ ఎలాంటి సమస్యలూ లేవు. ఆయన చెప్పినందువల్లనే ఇంతకాలంగా పట్టణంలో దేవాలయం కూడా లేదు," అన్నాడు పట్టణంపెద్ద.

ఇది విన్న పేరిశాస్త్రికి కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. అలాంటి వాడిక్కడ వున్నాడని తెలిస్తే, తను వాదోపవాదాలు చేసి తన ప్రతాపాన్ని చూపించి వుండేవాడే! ఆయనను గురించి పట్టణంపెద్ద ఇన్నాళ్ళూ తనకు ఎందుకు చెప్పలేదు?

పేరిశాస్త్రి ఉక్రోషంగా, "మొదటి రోజున ప్రతివాది భయంకరంగా నేను తర్కాన్ని మేళ వించి ఇచ్చిన ఉపన్యాసం విన్నాక, మీకు ఆ వృద్ధుడు చెప్పేది తప్పని తెలిసినట్లున్నది. లేకుంటే దేవాలయ నిర్మాణానికి ఒప్పుకుని వుండేవారు కారు కదా?" అన్నాడు.

పట్టణంపెద్ద తల అడ్డంగా వూపి, "మీరు వస్తున్నట్లు ఆయనకు ముందే చెప్పాము. చెప్పవలసిందిగా కోరి నాకు తెలియపరచండి. విషయం తెలిసేదాకా నా ప్రయాణం వాయిదా వేసుకుంటాను," అన్నాడు.

పట్టణంపెద్ద చిరునవ్వు నవ్వి, "అయ్యా! ఆయన సంగతి మీరు తెలుసుకోకపోవడమే మంచిది. ఇంతకూ, ఆయన మొదటి రోజున ఇచ్చిన తలనొప్పి మందు వేసుకున్నారా, లేదా? వైద్యవిద్యలో ధన్వంతరి కూడా ఆయన తర్వాతే!" అన్నాడు.

"ఆ మందు వేసుకున్నాను. నా తలనొప్పి చేత్తో తీసినట్టు మాయమయింది. మీరాయన గొప్ప వైద్యుడని అంటున్నారు. ఆయన గురించి తెలుసుకోవద్దంటున్నారు. నాతో అవసరం వున్న మనిషికి నేను సాయపడ

ఆయన మీరేమి చెప్పినా అంగీకరించమని సలహా ఇచ్చారు," అన్నాడు.

"బహుశా ఆయన నాతో వాదించడానికి భయపడి వుంటాడు. రాజాస్థాన పండితుల నందరినీ ఓడించిన వాడంటే ఎవరికైనా భయం సహజం!" అన్నాడు పేరిశాస్త్రి రవంత గర్వంగా.

దీనికి పట్టణంపెద్ద కాస్త తటపటాయించి, "సరే, ఇక మీకు అసలు సంగతి చెప్పక తప్పదు. ఆయన మహాజ్ఞాని కదా! అపైన వైద్యం కూడా తెలుసు. అందువల్ల, రోగులతో వాదించరు," అన్నాడు.

"అంటే, నేను రోగినా?" అన్నాడు పేరిశాస్త్రి చిరాగ్గా.



"ఆయన మిమ్మల్ని మొదటి నుంచి రోగి గానే భావించారు. అందుకే మిమ్మల్ని శ్రద్ధగా గమనించి తలనొప్పికి మందిచ్చారు. ఎండలో వెళుతూంటే గొడుగు ఇచ్చారు. తిరుగు ప్రయాణానికి ఉసిరికాయ లిచ్చారు," అన్నాడు పట్టణంపెద్ద.

"నా రోగం సంగతి సరే! నా మాటలు విన డానికేం?" అని అడిగాడు పేరిశాస్త్రి అసహ నంగా.

"అయితే వినండి!" అంటూ పట్టణంపెద్ద ఒక క్షణం ఆగి, "అయ్యా! తన పరిపాలనలో వున్న ఏ పట్టణమైనా సుఖశాంతులతో వుంటే రాజు సంతోషించాలి. దానికి బదులు రాజు కలవరపడుతున్నాడంటే, ఆయన ఆరోగ్యం సరిగా లేదని అర్థం. పండితులైన తమరు రాజుకు హితవు చెప్పకుండా, ఆయన చెప్పినట్లే చేస్తానంటూ ఇక్కడికి రావడం కూడా రోగ లక్షణమేనట! అవసరం లేని వాళ్ళకు ఏదో చెప్పాలనుకోవడం రోగమేనట!" అన్నాడు.

ఇది వింటూనే పేరిశాస్త్రికి చాలా కోపం వచ్చింది. ఆయన ఇంచుమించు అరుస్తు న్నట్టుగా, "అయితే, మీపట్టణం వాళ్ళందరూ నే చెప్పినదంతా ఎందుకు విన్నట్లు? అన్నిటికీ ఎందుకు అంగీకరించినట్లు? నన్నెన్నో కోర్కెలు ఎందుకు కోరినట్లు?" అని అడిగాడు.

"అయ్యా! తమరు అన్యథా భావించకండి. అదంతా ఆ మహాజ్ఞాని తమకిచ్చే చికిత్సలోని

భాగం. మీరు నొచ్చుకోకూడదనీ, చిన్నబుచ్చుకోకూడదనీ ఆయన అభిప్రాయం.ఆ కారణం వల్లనే, ఆయన చెప్పిన ప్రకారం మేమందరమూ మీరన్న వాటికి అంగీకరించి, కొన్ని కోర్కెలు కూడా కోరాం. నిజానికి ఆ కోర్కెలపై మాకాసక్తిలేదు. మీరిక్కడ దేవాలయం కడితే, అందులో ఆ మహాజ్ఞానిని దేవుడిగా వుంచాలన్న ఒక్క కోరిక మాత్రం మీ వల్ల తీరితే ఎంతో సంతోషిస్తాం!" అన్నాడు పట్టణం పెద్ద.

అంతా శ్రద్ధగా విన్న పేరిశాస్త్రి, ఈసారి శాంతంగా, "నువ్వనే ఆ మహాజ్ఞాని నాస్తికుడన్న అనుమానం కలుగుతున్నది. ఇంత పట్టణంలోదేవాలయం లేదు; హరికథలూ, పురాణ కాలక్షేపాల లాంటివి లేవు. అయినా, మీరా ముసలాయన్ని మహాజ్ఞాని అంటూ పొగుడుతున్నారు," అన్నాడు.

ఇందుకు పట్టణం పెద్ద, "తమరు పండితులు గనక, నేనంతగా వివరించనవసరం లేదు.ఆయన దైవభక్తీ,దైవభీతీ లాంటి వాటి గురించి మాకు ప్రబోధించకపోయినా — ఏది ఉత్తమ మానవధర్మమో ఆచరణ ద్వారా తెలియపరుస్తూంటారు. సాటి మనిషిని గౌరవించడం, కష్టాల్లో వున్న వారిని ఆదుకోవడం, ఆయన మా పట్టణ వాసులకు నేర్పారు. ఒక్క మాటలో — మానవసేవే మాధవసేవ అన్నది, ఆ మహాజ్ఞాని చెప్పే ధర్మసూక్ష్మం. అలాంటి వారిని మీరు నాస్తికుడనుకున్నా మేం కోపగించుకోం," అన్నాడు.

పేరిశాస్త్రి నిశ్చేష్టుడయ్యాడు. కాసేపటికి తేరుకుని, "ఇంత కాలం నా అంతటి వాడు లేడని విర్రవీగాను. అది ఒక విధమైన రోగ లక్షణమని నాకిప్పుడు తెలిసింది! దానికింకా చికిత్స పూర్తి అయినట్టులేదు. నేనూ ఈ పట్టణంలో స్థిరపడి, ఆ మహాజ్ఞాని సమక్షంలో ప్రయోజనం పొందుతాను," అన్నాడు.

ఈ విధంగా పేరిశాస్త్రి చంద్రపురంలో స్థిరపడిపోయి, తానక్కడ తెలుసుకున్న విశేషాలను సందేశంగా పంపాక, రాజా తన పొరబాటు గ్రహించాడు. ఆ తర్వాత ఆయన ఏనాడూచంద్రపుర ప్రజలప్రవర్తనవిషయంలో జోక్యం కలిగించుకోలేదు.






# 5

[కీర్తిసింహుడు గురుకులంలో విద్య పూర్తి చేసుకుని, గురువు కృష్ణచంద్రుడి ఆశీస్సులు పొంది రాజధానికి బయలు దేరాడు. ఆరావళీ పర్వత ప్రాంతాల అడవిని దాటుతూ వుండగా, అతన్ని బంధించడానికి చాటునుంచి ఇనుప వలను విసిరిన శత్రువుల భటులను పురుష వేషంలో వచ్చిన శక్తిసేన బాణాలతో హతమార్చింది. కీర్తిసేనుడు శక్తిసేనను గుర్తుపట్టి, ఆమె ఇచ్చిన ఉత్తరం చదివి, ఇరువురూ కలిసి అరణ్య మధ్యంలో వున్న దేవీ ఆలయానికి వెళ్ళి, దేవిని ప్రార్థించి హారం కోసం అన్వేషణ మొదలుపెట్టి, ఉత్తరపు దిశగా వెళ్ళి బిల్వ వృక్షాన్ని సమీపించారు. — తరవాత]

కీర్తిసింహుడు మారుమాట్లాడకుండా వెను దిరిగి ఆలయంలోకి వెళ్ళి, కొద్దిక్షణాల్లో, కాస్త తుప్పు పట్టిన త్రిశూలం ఒకదాన్ని చేత బట్టు కుని తిరిగి వచ్చాడు.

అప్పుడు ఎక్కడ తవ్వాలన్న ప్రశ్న ఎదు రైంది.

"బిల్వవృక్షపు మొదట్లో తవ్వి లాభం లేదు. దిగువున వేళ్ళు బాగా విస్తరించివుం టాయి. ఇది ఒక ఆధారం మాత్రమే! దీన్ని ఆధారం చేసుకుని ఎక్కడ తవ్వాలో నిర్ణయిం చుకోవాలి!" అంటూ కీర్తిసింహుడు ఒక్క క్షణం ఆలోచించి, బిల్వవృక్షానికి ఉత్తరపు దిక్కుగా, సరిగ్గా మూడడుగుల తర్వాత నేలను పరీక్షించటం ప్రారంభించాడు.

అక్కడ మొక్కల మధ్య ఒక చతురస్రాకా రపు బండరాయి నేలలో పాతుకుని వున్నది.

"ఇదిగో, ఇదే గుర్తయి వుంటుంది," అని కీర్తిసింహుడు త్రిశూలంతో బండరాయిని

లక్ష్మిగాయత్రి



ఒక్క ఊపున పక్కకు పెళ్ళగించి, అక్కడ తవ్వటం ప్రారంభించాడు.

సరిగ్గా మూడడుగుల లోతు తవ్వగానే అతడికి, ఇసుక మధ్య ఒక చిన్న ఇనప్పెట్టె దొరికింది.

తుప్పు పట్టి శిథిలమై వున్న, ఆ ఇనప్పెట్టె మూత తీసి చూశాడు, కీర్తిసింహుడు. అందులో మరొక చిన్న రాగిపెట్టె ఇమిడి వున్నది. ఆ రాగిపెట్టె మూత తీసి చూస్తే, లోపల మరొక వెండిపెట్టె కనిపించింది. ఆ వెండిపెట్టె మూత తీసి చూస్తే, లోపల ఒక వెండిరేకు కనిపించింది.

ఆ రేకు మీద బంగారు అక్షరాలతో, "సృష్టి, సృష్టికర్త ఇంట, సృష్టికర్త సగభాగంలో ఉన్నది!" అని రాసి వున్నది. ఆ రేకు తప్ప పెట్టెలో మరేమీ లేదు!

అది చూడగానే శక్తిసేన నిరుత్సాహంగా, "మళ్ళీ ఇదేమిటి, కీర్తిసింహా?" అన్నది.

కీర్తిసింహుడు మాత్రం నిరుత్సాహ పడలేదు. రాగిపెట్టెను మళ్ళీ ఇనప్పెట్టెలో పెట్టి, దాన్ని యథాప్రకారం భూమిలో పాతి పెట్టి, వెండి పెట్టెను మాత్రం రేకుతో సహా తన దుస్తుల మాటున జాగ్రత్తగా భద్రపరుచుకున్నాడు.

ఆసరికి బాగా చీకటి పడింది. అయితే, ఆనాడు కృష్ణపాడ్యమి కావటం చేత, కృష్ణపక్షపు చంద్రుడు వెన్నెల కాంతులు బాగానే వెదజల్లుతున్నాడు.

శక్తిసేనా, కీర్తిసింహులిద్దరూ చుట్టు తిరిగి మళ్ళీ దేవి ఆలయ ముఖద్వారం దగ్గిరకు వచ్చారు.

"పద, మరొక్కసారి శక్తి దర్శనం చేసుకుని, తిరిగి వెళదాం!" అంటూ లోపలికి నడిచాడు కీర్తిసింహుడు.

శక్తిసేన అతణ్ణి అనుసరించింది. ఇద్దరూ పూర్వం లాగే మోకరిల్లి, చేతులు మోడ్చి భక్తితో శక్తికి నమస్కరించారు.

కీర్తిసింహుడు, శక్తికి నమస్కరిస్తూ, "తల్లీ, మహాశక్తీ! నీ దయవల్ల ఇప్పటి వరకూ అంతా సవ్యంగా జరుగుతున్నది. నన్ను నీ కృపకు పాత్రుణ్ణి చేసి, మహోన్నతపీఠం ఎక్కించావు. నిన్నుప్రతి నిత్యమూ అర్చించి, తరించే



భాగ్యం కూడా ప్రసాదించు, తల్లీ!" అని ప్రార్థించాడు.

అతడి మాటలు పూర్తయిన మరుక్షణంలో, ఆలయమంతా ఒక్కసారిగా దేదీప్యమైన వెలుగుతో నిండిపోయింది. ఆ వెలుగులో నల్లని శక్తి విగ్రహం మరింత ప్రకాశమానంగా కనిపించింది. మహాశక్తి ముఖం, పూర్వం కంటే ప్రసన్నంగా చిరునవ్వుతో వెలిగిపోతున్నది.

శక్తిసేనా, కీర్తిసింహులిద్దరూ, ఆ వెలుగులో జ్వాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్న శక్తిని చూసి ముగ్ధులవుతూ సాష్టాంగ ప్రణామం చేశారు.

వాళ్ళు తిరిగి లేచేంతలో, "నాయనా, కీర్తిసింహా! నీ రాజధానీ నగరంలో గల పన్నీటి సరస్సు పక్కనే వున్న మైదాన ప్రదేశంలో, ఒక ఆలయం నిర్మించి, రాబోయే చైత్రశుద్ధ దశమీ శుక్రవారం నాడు, జ్వాలాముఖి అన్న పేరుతో, ఈ మహాశక్తిని అక్కడ ప్రతిష్ఠ చెయ్యి. నీకు సమస్త శుభాలూ కలుగుతాయి!" అన్న అశరీరవాణి వినిపించింది.

ఆ మాటలు విన్న శక్తిసేనా, కీర్తిసింహుల ఆనందానికి మేరలేదు.

వాళ్ళు మళ్ళీ సాష్టాంగ ప్రణామం చేసి, జ్వాలాముఖీదేవికి కృతజ్ఞతలు తెలుపుకున్నారు. ఆ తర్వాత లేచి ఆలయం బయటికి వచ్చి, ముఖద్వారాన్ని ఎప్పటిలాగా మూసి, తాళం వేసి, బైటికి వచ్చి గుర్రాలెక్కారు.

వాళ్ళు గుర్రాలు అధిరోహించిన మరు క్షణం, మహాశక్తి ఆలయం పూర్వంలాగే అంధకారమయంగా మారిపోయింది.

చంద్రకాంతిలో వాయువేగంతో ప్రయాణించిన శక్తిసేనా, కీర్తిసింహులిద్దరూ, మర్నాటి మధ్యాహ్నం దాటే సరికి రాజధానీ నగరం చేరుకున్నారు.

"శక్తీ, నువ్వు తిన్నగా మీ ఇంటికి వెళ్ళు. నేను త్వరలోనే మహారాజుతో కలిసి, మీ ఇంటికి వస్తాను," అని కీర్తిసింహుడు, శక్తిసేనకు చెప్పాడు.

శక్తిసేన అంగీకారంగా తలవూపి, గుర్రాన్ని తన ఇంటికి నడిపించింది. కీర్తిసింహుడు అంతఃపురం చేరుకున్నాడు.

కొడుకు రాక కోసం ఆతృతగా ఎదురు చూస్తున్న రాజదంపతులు, అతన్ని చూసి

పరమానంద భరితులయ్యారు. కుశల ప్రశ్నలు,పలకరింపులు అయ్యాక, ఏకాంతంలో తండ్రికి జరిగినదంతా వివరించాడు కీర్తి సింహుడు.

అంతా విన్నమహారాజు ఆనందంతో పొంగి పోతూ, "మన జీవితాలు ధన్యమయ్యాయి, నాయనా! దేవి మనల్ని కరుణించి, ఉద్ధరించ బోతున్నది!" అని, "ఇంతకూ హారం సంగతి ఏమయినట్టు?" అని ప్రశ్నించాడు.

"అది కూడా దొరికినట్టే, నాన్నగారూ! ఆ పని మీదే మనం ఒకసారి జయసేనుడి ఇంటికి వెళ్ళవలసి వున్నది," అన్నాడు కీర్తిసింహుడు చిన్నగా నవ్వుతూ.

"సరే, నేటి రాత్రికే వెళదాం!" అన్నాడు సుషేణుడు.

ఆ నాటి రాత్రి భోజనానంతరం, తండ్రీ, కొడుకులిద్దరూ జయసేనుడి ఇంటికి వెళ్ళారు. మహారాజునూ, యువరాజునూ చూసి పరమా నందంతో ఆహ్వానిస్తూ, జయసేనుడు, "నేటి రాత్రికి మీ ఇద్దరూ వస్తారని, నా కుమార్తె చెబుతూనే వున్నది!" అంటూ వారిని ఆద రంగా కూర్చోబెట్టాడు.

జయసేనుడి మాటలకు మహారాజు, కీర్తి సింహుడు ముఖాలు చూసుకుని నవ్వుకున్నారు.

తర్వాతకొద్దిసేపుఏదోసంభాషణ అయ్యాక, మహారాజు,కొడుకుచెప్పినప్రకారం,"జయసేనా! మీ ఇంట పురాతనమైన సరస్వతీ విగ్రహం ఏదైనా వున్నదా?" అని ప్రశ్నించాడు.



మహారాజు ప్రశ్న వినగానే జయసేనుడు ఆశ్చర్యపడుతూ, "ఉన్నది, మహాప్రభూ!" అంటూ లేచి వెళ్ళి, సరస్వతీదేవి కూర్చుని వీణ వాయిస్తున్నట్టుగా వున్న, ఒక దంతపు విగ్రహాన్ని తీసుకొచ్చి మహారాజుకు అందిస్తూ, "దీన్ని మా తాతల నాడు ఎప్పుడో చేయించి పెట్టారట! కాని, మీరుకూడా దీన్నే అడగటం విచిత్రంగా వున్నది, ప్రభూ!" అన్నాడు.

"ఏం, మీ అమ్మాయి కూడా ఈ విగ్రహం కోసమే అడిగిందా?" అంటూ కీర్తిసింహుడు చిరునవ్వుతో ప్రశ్నించాడు.

"అవును, యువరాజా! నా కుమార్తె ఇంటికి వస్తూనే, ఇప్పుడు మహారాజు అడిగినట్టే అడి గింది. నేను కాస్త ఆలోచించి ఈ విగ్రహం



బల్ల మీద పెట్టి, నమస్కరించి, ఒక పక్కగా నిలబడింది.

కీర్తిసింహుడు ఆ భరిణను తీసి తండ్రికి అందించాడు.

సుషేణుడు భరిణ మూత తీసి చూశాడు. అందులో ధగద్ధగాయ మానంగా మెరుస్తున్న నవరత్న పతకంతో, ధవళ కాంతులీనుతున్న ముత్యాలహారం కనిపించింది.

మహారాజు ఆనందాశ్చర్యాలతో దాన్ని చూస్తూ, "ఎక్కడ దొరికిందమ్మా, నీకిది?" అని ప్రశ్నించాడు.

శక్తిసేన వినయంగా, వెండి రేకు మీద రాసి వున్నది చెప్పి, "ఇంటికి తిరిగి వస్తూ ఆలోచించాను. తార్కికంగా – సృష్టించబడిన ప్రతి వస్తువూ సృష్టి, దానిని సృష్టించినవాడు సృష్టికర్తా అవుతారు! ఆ ప్రకారం చూస్తే, ఈ ముత్యాలహారం సృష్టి, మా పూర్వీకుడైన జయసేనుడు సృష్టికర్తా అవుతారు. 'సృష్టికర్త ఇంట' అంటే, మా ఇంట! రెండవసారి చెప్పబడ్డ 'సృష్టికర్త' పదానికి అర్థం బ్రహ్మ కావచ్చునని ఊహించాను. సృష్టికర్త సగభాగం అంటే, బ్రహ్మదేవుడి అర్థాంగి సరస్వతీదేవి. అందువల్లనే, ఇంటికి వస్తూనే, ఈ విగ్రహం కోసం నాన్నను అడిగాను. విగ్రహాన్ని సూక్ష్మంగా పరిశీలించగా, లోపల ఈ హారం దొరికింది. తీసి భద్రపరిచాను. వెండి రేకు మీద రాసివున్న దాన్ని, గ్రాహ్యం చేసుకున్న యువరాజు, నేటి రాత్రికే మీతో కలిసి తప్పక ఇక్కడికి వస్తారని

పాతదేనని చెప్పాను. అంతే, దీన్ని తీసుకుని తన గదిలోకి పోయి, చాలాసేపు ఏకాంతంలో గడిపింది. ఆతర్వాత విగ్రహాన్ని తిరిగి ఆ స్థానంలోపెడుతూండగా, కారణం అడిగాను. అప్పుడే, నేటి రాత్రికి మీరు వస్తారనీ, అన్ని వివరాలూ మీరు చెబుతారనీ చెప్పింది," అన్నాడు జయసేనుడు.

కీర్తిసింహుడు చిన్నగా నవ్వుతూ, "అయితే, మాకు కావలసింది, ఈ విగ్రహం కాదు!" అన్నాడు.

అతడి మాటలు పూర్తి కాకుండానే, ఆ గదిలోకి అడుగుపెట్టిన శక్తిసేన, పట్టుగుడ్డలో చుట్టిన చిన్న దంతపు భరిణ నొకదాన్ని కీర్తిసింహుడికీ, మహారాజుకూ ఎదురుగా వున్న

ఊహించి, మా నాన్నగారికి చెప్పాను," అంటూ వివరించింది.

శక్తిసేన మాటలు విన్న ముగ్గురూ చాలా సంతోషించారు.

రాజుసుషేణుడునవ్వుతూ, "అంతాబాగానే వున్నది గాని, జయసేనా! ఇంతకూ మన పందెం సంగతి ఏమైనట్టు?" అని ప్రశ్నించాడు.

మహారాజు మాటలకు శక్తిసేన సిగ్గుతో తలవంచుకున్నది.

ఇక్కడ ఇలా ఆనందం పొంగిపొర్లుతూం డగా, అక్కడ కాంభోజలో — కాంభోజ, నగ, చాక్య దేశాధిపతులు ముగ్గురికీ ఆందోళన అధికం కాసాగింది.

మరొక నాలుగు రోజులు గడిచే సరికల్లా, వాళ్ళు పంపిన భటులు అడవిలో మరణిం చారని వాళ్ళకు తెలిసింది. అంతేగాక, కీర్తి సింహుడు హారాన్ని సంపాయించాడనీ, జ్వాలా ముఖీ దేవత అతడికి ప్రసన్నమైందనీ, ఆ దేవత ఆలయ నిర్మాణానికీ, శక్తిసేనా కీర్తి సింహుల వివాహానికీ, కీర్తిసింహుడి పట్టాభిషే కానికీ ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయనీ, వేగులు వాళ్ళకు వార్తలు అందించారు.

ఆ వార్తలు వింటూనే, కుట్రదారులు ముగ్గురూ కుప్పకూలి పోయారు.

వాళ్ళల్లో ముందుగా తేరుకున్న నాగా కర్ణుడు, మిగిలిన ఇద్దర్నీ ఉత్సాహపరుస్తూ, "ఇది మన మంచికే వచ్చింది! కోసల ఉత్సవ సంరంభంలో మునిగి వుండగా, మనం



ముగ్గురం సర్వసైన్యాలను కూడగట్టుకుని, హఠాత్తుగా కోసల మీద దాడి చేద్దాం!" అన్నాడు.

ఇందుకు మిగతా ఇద్దరూ అంగీకరిం చారు.యుద్ధసన్నాహాలుప్రారంభమయ్యాయి.

అయితే, వాళ్ళకు తెలియందేమంటే — కోసలలో నిజానికి జరుగుతున్నవి యుద్ధ సన్నాహాలు. ఉత్సవ సంరంభమంతా కేవలం శత్రువులను పెడదారి పట్టించడానికి పుట్టిం చిన పుకారు మాత్రమే!

పరిస్థితులను ఎప్పటికప్పుడు సమీక్షిస్తున్న కీర్తిసింహుడు, కుట్రదారుల యుద్ధ సన్నా హాలు సగం కూడా పూర్తి కాకుండానే, ఊహిం చని విధంగా, యువరాజు హెూదాలో సైన్యానికి నాయకత్వం వహించి, పెద్దపెట్టున కాంభోజ

మీద విరుచుకుపడ్డాడు. సైన్యాధ్యక్షుడైన రణ మల్లుడి న్యాయకత్వాన మరికొంత సైన్యం, అటు ఉత్తరాన వున్న నగదేశం మీద దండెత్తింది.

సుశిక్షితులైన కోసల సైనికులు అట్టే శ్రమించకుండానే, కాంభోజ, నగదేశాలు స్వాధీనమయ్యాయి. అటు తర్వాతచాళ్య దేశం మీద దండెత్తి, రాజు కుండినవర్మను కూడా బంధించాడు,కీర్తిసింహుడు.

అతడు అంతటితో ఆగక, యుద్ధంలో ఈ మూడు దేశాలకూ సహాయపడిన మరొక రెండు మూడు దేశాల మీదకు కూడా తన సైన్యాన్ని నడిపి, వాటిని కూడా జయించాడు.

ఇదంతా గమనించిన నాలుగైదు చిన్న దేశాల రాజులు తమకు తాముగా కీర్తి సింహుణ్ణి శరణు జొచ్చి, తాము అతడికి సామంతులుగా వుంటామనీ,తమను కాపాడవలసిందనీ ప్రార్థించారు.

విజయోత్సాహంతో కీర్తిసింహుడు కోసలకు తిరిగి వచ్చే సరికి, జ్వాలాముఖీదేవి ఆలయం దాదాపు పూర్తి అయింది. విజయోత్సవాలతో బాటు, అతడి వివాహ సన్నాహాలు కూడా చురుకుగా సాగాయి.

ఇరువురి తల్లిదండ్రులూ, గురువు కృష్ణ చంద్రుడూ ఆశీస్సులు కురిపిస్తూండగా, ప్రజల ఆనందోత్సాహాల మధ్య, శక్తిసేనా, కీర్తిసింహుల వివాహం అత్యంత వైభవంగా జరిగిపోయింది.

ఆ సరికి, చైత్ర మాసం రావటం, జ్వాలా ముఖీదేవి ఆలయ నిర్మాణం పూర్తికావటం, దేవీ విగ్రహాన్ని అడవిలోనుంచి తీసుకురావటం జరిగాయి.

చైత్రశుద్ధదశమీశుక్రవారంనాడు, మంగళ వాద్యాలు మోగుతూండగా, శక్తిసేనా కీర్తి సింహులు, జ్వాలాముఖీ దేవిని ఆలయంలో ప్రతిష్ఠించారు.

తరతరాలుగా ఎదురు చూస్తున్న శుభ దినం, తమ తరంలో వచ్చినందుకు పొంగి పోతూ, సుషేణుడు, వైష్ణవీదేవి; జయసేనుడు, అతడి భార్య తమ బిడ్డలపై ఆశీస్సుల వర్షం కురిపించారు. — (అయిపోయింది)






# స్వర్ణఖడ్గం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు,"రాజా, ఈ అర్ధరాత్రి వేళ నక్కలూ, విషసర్పాలూ, భూత ప్రేతాల్లాంటి క్షుద్రజీవులు తిరుగాడే, ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న పాట్లు చూస్తూంటే ఎవరికైనా జాలి కలుగుతుంది. సరే, ఇంతకూ నువ్వు ఎలాంటి శక్తులు సంపాయించ కోరి ఇక్కడ తిరుగుతున్నట్టు? ఏవైనా అపూర్వ శక్తుల కోసం ప్రయత్నిస్తున్నావా? అలా అయితే ఎంతో అపూర్వమైన శక్తి సంపద గల స్వర్ణఖడ్గం చేతిలో వుండి కూడా, తను ప్రేమించిన రాకుమారిని పరిణయమాడలేకపోయిన, రాజసింహుడనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు :

## బేతాళ కథలు



శ్రీచందనపురాన్ని, రాజసింహుడనే రాజు పాలించేవాడు. శ్రీచందనపురానికి, మణిమేఖల,సౌగంధికపురంఇరుగుపొరుగురాజ్యాలు. సుసంపన్నమైన శ్రీచందనపురాన్ని ఆక్రమించడానికి, ఆ రెండు రాజ్యాల పాలకులూ తగిన అవకాశం ఎప్పుడు వస్తుందా అని నిరీక్షించసాగారు.

ఇలా వుండగా, వరుసగా రెండు సంవత్సరాల పాటు వర్షాలు లేకపోవడంతో, శ్రీచందనపుర రాజ్యంలో భయంకరమైన కరువు ఏర్పడింది. ఇటువంటి విపత్కర పరిస్థితుల్లో, అపారమైన సైన్యాన్ని పోషించే శక్తి లేని రాజసింహుడు, సగానికి సగం మంది సైనికులను కొలువు నుంచి తొలగించాడు.

ఈ కారణం వల్ల, సైనికంగా బలహీనపడిన శ్రీచందనపుర రాజ్యాన్ని ఆక్రమించుకునేందుకు, పొరుగు రాజ్యాలు ఏ క్షణాన్నయినా దాడి చేయవచ్చని, వేగుల ద్వారా రాజసింహుడికి వార్త అందింది.

ఒకనాటి రాత్రి రాజసింహుడు, ఆస్థాన దైవజ్ఞుడైన చిన్మయానందస్వామితో, తన రహస్యమందిరంలో సమావేశమయ్యాడు. చిన్మయానందస్వామి, రాజసింహుడి తాతగారి కాలం నుంచి, ఆ పదవిలో వుంటున్నాడు. ఇప్పుడాయన పండు ముదుసలి.

రాజు, చిన్మయానందస్వామితో, "స్వామీ! రాజ్యపరిస్థితి చూస్తున్నారు గదా! ఇటువంటి స్థితిలో మన రాజ్యంపై శత్రు రాజ్యాలు దాడి చేయనున్నవని, వేగులు వార్త పంపారు. ఇప్పుడు అంతగా సైన్య బలం లేని మనం యుద్ధానికి దిగితే ఓడిపోక తప్పదు. ఈ గండంనుంచి గట్టెక్కేదెలా?" అన్నాడు ఎంతో విచారంగా.

చిన్మయానందస్వామి కాసేపు ధ్యానముద్రలో వుండి కళ్ళు తెరిచి, "మనం శత్రు దేశాలతో యుద్ధం చెయ్యక తప్పదు, నాయనా! భయపడకు, విజయలక్ష్మి మనల్నే వరిస్తుంది. నువ్వు పూజామందిరంలోకి వెళ్ళి, కాళీ మాత పీఠం కింద వున్న మీటను కుడివైపుకి తిప్పు, అప్పుడొక పలక తెరుచుకుంటుంది. దాని లోపలి అరలో ఒక స్వర్ణఖడ్గం వుంటుంది. ఆ స్వర్ణఖడ్గం చేతపట్టిన వాడు, ఎంతటి

బలవంతుడైన శత్రువునైనా అవలీలగా జయిం చగలడు. అయితే, ధర్మపక్షాన పోరాడినంత సేపే ఆ స్వర్ణఖడ్గం విజయాన్ని కలిగిస్తుంది. స్వర్ణఖడ్గ ధారుడు అధర్మానికి పాల్పడి యుద్ధానికి పూనుకుంటే, ఖడ్గం కొయ్యకత్తిలా మారిపోతుంది!" అని ఖడ్గం మహిమ తెలి పాడు.



రాజసింహుడు, దైవజ్ఞుడి మాటలకు అబ్బురపడుతూ, పూజామందిరానికి వెళ్ళి, దేవికి నమస్కరించి, మీటను కుడివైపుకు తిప్పాడు. పలక పక్కకు తొలగడంతో లోపల డొల్ల ఏర్పడింది. అందులో తళ తళ మెరు స్తున్న మూడడుగుల స్వర్ణఖడ్గం కనిపించింది. దాని పిడి అందమైన పచ్చలతో తాపడం చేసి వున్నది.

రాజసింహుడు ముందుకు వంగి కత్తిని చేతికి తీసుకున్నాడు. మరుక్షణం, ఏదో అద్భుతమైన అదృశ్యశక్తి జరజరా అతడి శరీరంలోకి ప్రసరించినట్లయింది.

ఒక వారం గడిచాక, మణిమేఖల, సౌగంధి కపురం మహారాజులు, ఒక్కుమ్మడిగా పెద్ద సైన్యంతో శ్రీచందనపురం మీదికి దండెత్తి వచ్చారు.

రాజసింహుడు, ఉన్న కొద్దిపాటి సైన్యంతో స్వర్ణఖడ్గం చేతబూని శత్రువులను ఎదిరిం చాడు. శత్రు సైనికులకు, ఒక్కొక్క రాజసిం హుడు ఒక్కొక్క సైనికుడి ముందు నిలబడి యుద్ధం చేస్తున్న భ్రాంతి కలిగింది. కొద్దిసేపటి లోనే శత్రు సైన్యాలు చెల్లాచెదరైనాయి. మణిమేఖల, సౌగంధిపురం రాజులు, శ్రీ చం దనపురానికి సామంతరాజులుగావుండి, ఏటా కప్పం కట్టడానికి సంధి షరతుగా అంగీక రించారు. త్వరలోనే స్వర్ణఖడ్గ ప్రభావం అంద రికీ తెలిసిపోయింది.

కొంతకాలం గడిచాక, ఒకనాడు రాజసిం హుడు అడవికి వేటకు వెళ్ళాడు. సాయంత్రం వరకూ వేటలో గడిపి, అతడు కోటకు వెను దిరిగే ప్రయత్నంలో వుండగా, దాపుల నుంచి, "రక్షించండి! రక్షించండి!" అన్న కేకలు విని పించాయి.

మరొక ఆలోచన లేకుండా, రాజసింహుడు గుర్రాన్ని అటుకేసి దౌడు తీయించాడు.



ఒక చెట్టు కింద పల్లకి ఒకటి దించబడి వున్నది. దాని ముందు నిలబడి వున్న ఒక అద్భుత సౌందర్యరాశి చుట్టూ చేరిన నలుగురు యువతులు భయంతో కంపించిపోతూ దిక్కులు చూస్తున్నారు.

వాళ్ళు రాజసింహుణ్ణి చూస్తూనే ధైర్యం తెచ్చుకుని, దూరంగా రాజభటులతో పోరాడుతున్న ఒక యువకుణ్ణి, అతడికి చూపుతూ, "మహావీరా! ఈ దుర్మార్గుడు, మా యువరాణిని అపహరించుకోవాలని చూస్తున్నాడు!" అని చెప్పారు.

అంతలో, యువకుడితో పోరాడుతున్న రాజభటులు, వాడి ధాటికి తట్టుకోలేక చెల్లాచెదురుగా పారిపోసాగారు. రాజసింహుడు ఒర నుంచి స్వర్ణఖడ్గం తీసి, ఆ యువకుడితో తలపడ్డాడు. కన్ను మూసి తెరిచేంతలో యువకుడి చేతిలోని కత్తి ఎగిరి అంత దూరాన పడింది.

రాజసింహుడు, తన ఖడ్గాన్ని యువకుడి గుండెలకు ఆనించి, "ఎవరు నువ్వు? ఈ రాకుమారిని అపహరించుకుపోవాలనిఎందుకు ప్రయత్నిస్తున్నావు?" అని కఠినంగా ప్రశ్నించాడు.

యువకుడు తల వంచుకుని, "మీరెవరో మహావీరుల్లా వున్నారు! నా పేరు కల్యాణవర్మ, వసంత నగరం యువరాజును. ఈ సౌగంధిక పురం యువరాణి విజయేశ్వరిని ప్రాణాధికంగా ప్రేమించాను. అయితే, ఈమె శ్రీచందనపురం మహారాజు రాజసింహుణ్ణి ప్రేమిస్తున్నట్టు తెలిసి, వనవిహారం వచ్చిన ఈమెను అపహరించుకుపోయి, రాక్షస వివాహం చేసుకోవాలనుకున్నాను. అయితే, సమయానికి మీరొచ్చి నా ప్రయత్నాన్ని విఫలం చేశారు," అన్నాడు.

రాజసింహుడు కొద్దిసేపు మౌనంగా వుండి, "ఏది ఏమైనా, ఒక యువతి అభీష్టానికి వ్యతిరేకంగా వివాహమాడాలని చూడడం భావ్యం కాదు. ఇక ఏనాడూ ఇలాంటి అకార్యాలకు పూనుకోకు!" అని మందలించి, స్వర్ణఖడ్గాన్ని ఒరలో పెట్టాడు.

అంతవరకూ, స్వర్ణఖడ్గాన్ని నిశితంగా పరిశీలిస్తున్న కల్యాణవర్మ, "మీరు శ్రీ చందన

పురం మహారాజు రాజసింహుడు, అనుకుంటాను!" అన్నాడు.

"అవును!" అన్నాడు రాజసింహుడు, రాకుమారి విజయేశ్వరి కేసి తలతిప్పి చూస్తూ.

ఇది విన్న విజయేశ్వరి తల వంచుకుని, పక్కన వున్న చెలికత్తెతో, "వచ్చే పంచమి నాడు నాన్నగారు, నాకు స్వయంవరం ఏర్పాటు చేశారు. ఆ సమయంలో అక్కడ కత్తియుద్ధం పోటీ వుంటుంది. స్వయంవరంలో తప్పక పాల్గొనవలసిందిగా, నేను ఆహ్వానిస్తున్నానని, రాజసింహుల వారికి చెప్పవే!" అన్నది చిరు దర హాసంతో.

రాజసింహుడు, "తప్పక రాగలను!" అంటూ నవ్వు నవ్వి, గుర్రాన్ని రాజధాని కేసి మళ్ళించాడు.

పంచమిరోజు రానే వచ్చింది. ఉదయాన్నే చక్కగా అలంకరించుకుని, స్వయంవరానికి బయలుదేరుతున్న రాజసింహుణ్ణి చూసి, పట్టపురాణి ప్రియంవద కళ్ళనీళ్ళు పెట్టుకుని, "ప్రభూ! అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యనైన నేను జీవించి వుండగా, మీరు మరొక యువతినివివాహమాడచూడడం భావ్యమా?" అన్నది.

దానికి రాజసింహుడు ఏమాత్రం చలించక, "రాకుమారి విజయేశ్వరి జగన్మోహన సౌందర్యవతి. పైగా, క్షత్రియులకు ద్వితీయ వివాహం ధర్మసమ్మతమే గదా!" అన్నాడు.

తర్వాత అతడు సౌగంధికపురం చేరి, స్వయంవర మండపంలో అడుగుపెడుతూనే, అక్కడ వున్న రాజకుమారులను ఒకసారి





కలయచూసి, ఒరలో నుంచి స్వర్ణఖడ్గాన్ని బయటికి తీస్తూ, "నాతో కత్తి యుద్ధానికి తలపడే వీరులెవరో ముందుకు రండి!" అన్నాడు గంభీర స్వరంతో.

ఇది విన్న రాకుమారులలో గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఆ వచ్చిన వ్యక్తి ఎవరో, అతడు ఒరలోంచిబయటికి లాగిన స్వర్ణఖడ్గం ఎంత మహత్తు గలదో, వాళ్ళందరూ ఎరిగినదే. ఆ కారణం వల్ల, ఎవరూ సాహసించి, ముందుకు రాలేకపోయారు.

ఇంతలో ఒక మూల ఆసీనుడై వున్న కల్యాణవర్మ లేచి, "పోటీకి నేను సిద్ధం!" అంటూ ఒరలోంచి కత్తి దూసి ముందుకు వచ్చాడు.

కల్యాణవర్మను గుర్తుపట్టిన రాజసింహుడు, ఈసడింపుగా, "ఓహో, నువ్వా! ఆ నాడు అడవిలో జరిగిన శృంగభంగం ఇంతలోనే మరిచావన్న మాట," అన్నాడు.

ఇద్దరూ కత్తి యుద్ధం ప్రారంభించారు. రాజసింహుడి చేతిలోని స్వర్ణఖడ్గం, కల్యాణవర్మ కత్తిని ఖణిల్లని తాకగానే, స్వర్ణఖడ్గం కొయ్యకత్తిగా మారిపోయింది.

ఇది చూసి రాజసింహుడు తెల్లబోయాడు. రాకుమారి విజయేశ్వరి, రాకుమారుల కరతాళ ధ్వనుల మధ్య, కల్యాణవర్మ మెడలో పూలమాల వేసింది. చిత్రంగా వెంటనే కొయ్యకత్తి, స్వర్ణఖడ్గంగా మారింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, స్వర్ణఖడ్గం సాయంతో, లోగడ రాజసింహుడు బలవంతులైన ఇద్దరు పొరుగు రాజులను సులభంగా జయించాడు. అడవిలో కల్యాణవర్మను క్షణాల మీద ఓడించాడు. అధర్మ యుద్ధంలో మాత్రమే గదా, స్వర్ణఖడ్గం కొయ్యకత్తిగా మారుతుందని, ఆస్థాన దైవజ్ఞుడు చెప్పింది? అలాంటప్పుడు, తనను ప్రేమించిన రాకుమారి విజయేశ్వరిని భార్యగా చేసుకునేందుకు అతడు కల్యాణవర్మతో చేసిన కత్తి యుద్ధం, అధర్మయుద్ధం ఎలా అవుతుంది? రాజసింహుణ్ణి ఎంతగానో ప్రేమించిన విజయేశ్వరి, అదంతా మరచినదానిలా కల్యాణవర్మ మెడలో పూలమాల వేసి, అతణ్ణి భర్తగా స్వీకరించడం ఆశ్చర్యం కాదా? అంతే కాక,

ఆ మరుక్షణం కొయ్యకత్తి, స్వర్ణఖడ్గంగా మారడంలోని అంతరార్థమేమిటి? ఈ సందేహాలకుసమాధానంతెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధర్మయుద్ధంలో మాత్రమే స్వర్ణఖడ్గం జయాన్ని కలిగిస్తుందని, దైవజ్ఞుడు చెప్పినదాంట్లో సంశయానికి ఏ మాత్రం తావు లేదు. ఒక రాజ్యం కరువు కాటకాల్లో కుమిలిపోతూ ఉన్నప్పుడు, దాన్ని ఆక్రమించబోవడం క్షాత్రధర్మం కాదు, అమానుషం. ఆ కారణం వల్లనే, ఆ యుద్ధంలో స్వర్ణఖడ్గం రాజసింహుడికి విజయం చేకూర్చింది. ఇక, కల్యాణవర్మ విషయంలో అతడు తనను ప్రేమించని రాకుమారిని బలవంతంగా ఎత్తుకుపోవాలని చూశాడు. ఆ సమయంలో ధర్మం కల్యాణవర్మ పక్షాన లేదు. అందుచేతనే స్వర్ణఖడ్గం చేత గల రాజసింహుడి వల్ల అతడు చిత్తుగా ఓడిపోయాడు.

ఈ జరిగినంతవరకూ, ధర్మం రాజసింహుడి పక్షానే వున్నది. పట్టమహిషి వుండగా, మరొక వివాహం చేసుకోవడం రాజులకు నిషిద్ధం కాకపోయినా, ధర్మసమ్మతం అని మాత్రం అనలేం. అది మొదటి భార్యకు ద్రోహం చేసినట్లే అవుతుంది. అందువల్లనే, రాజసింహుడు, కల్యాణవర్మతో కత్తియుద్ధం చేసే సమయంలో స్వర్ణఖడ్గం, కొయ్యకత్తిగా మారి అతణ్ణి భంగపాటుకు గురిచేసి కనువిప్పు కలిగించింది.

పోతే, స్వయంవర నిబంధనల ప్రకారం, కత్తియుద్ధంలో నెగ్గినవాణ్ణే విజయేశ్వరి తన భర్తగా ఎన్నుకు తీరాలి. ఇందులో ఆమె ఇష్టాయిష్టాల ప్రసక్తి ఆవంతైనా లేదు. స్వయంవర ఫలితాన్నిఎదిరించగలస్వతంత్రురాలుకాదామె. ఎప్పుడైతే ఆమె, కల్యాణవర్మ మెడలో పూలమాల వేసి, భర్తగా వరించిందో — ఆ క్షణంలో రాజసింహుడు,ఆమెను భార్యగా పొందే అవకాశాన్నిశాశ్వతంగాకోల్పోయాడు.కనక, కొయ్యకత్తి తిరిగి స్వర్ణఖడ్గంగా మారింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

(ఆధారం: రాఘవరాజు పట్టాభిరామరాజు)



# బాడుగ ఇల్లు

హేలాపురిలో నందయ్య అనే అతను బాడుగ ఇంట్లో వుంటున్నాడు. ఇంటి యజమాని తన కుమార్తె వివాహం కారణంగా, నందయ్యను వెంటనే ఇల్లు ఖాళీచేయమని అడిగాడు.

నందయ్యకు నలుగురు పిల్లలు. అతను ఎన్ని బాడుగ ఇళ్ళు చూసినా, అంతమంది పిల్లలున్న వాళ్ళకు ఇల్లు అద్దెకివ్వమని యజమానులు నిర్మొహమాటంగా చెప్పేస్తున్నారు. పిల్లల వల్ల గొడవలెక్కువని వాళ్ళ భయం. నందయ్య, ఇంటి యజమానికి పరిస్థితిఎంతవివరించినా, అతను మాత్రం ఇవేవీ పట్టించుకోకుండా, ఇల్లు ఖాళీచేయమని వత్తిడి చేస్తూనే వున్నాడు.

ఇదంతా గమనిస్తున్న నందయ్య రెండో కొడుకు తొమ్మిదేళ్ళవాడు, పక్క వీధిలో ఖాళీగా వున్న ఒక ఇంటికి వెళ్ళి, దాని యజమానిని ఇల్లు అద్దెకు కావాలని అడిగాడు.

"ఇల్లు అద్దెకు కావాలని కొందరు వచ్చిపోతున్నారు. ఏమైనా, పిల్లలున్న వాళ్ళకు మాత్రం ఇల్లు అద్దెకివ్వం," అన్నాడు ఇంటి యజమాని.

దానికి నందయ్య కొడుకు, "నిజం చెపుతున్నానండి! నాకు పిల్లలు లేరండి. అమ్మా, నాన్నా, అన్నయ్య, అక్కచెల్లి వున్నారంతే. కాస్త దయవుంచి ఇల్లుఅద్దెకివ్వండి," అని అడిగాడు ముద్దుగా.

వాడి తెలివితేటలకు ముచ్చటపడి, వెంటనే ఇల్లు అద్దెకివ్వడానికి ఒప్పుకున్నాడు ఇంటి యజమాని. ఈ విధంగా నందయ్య అద్దె ఇంటి సమస్య తీరడమే గాక, నలుగురూ అతడి కొడుకు తెలివితేటల్ని గొప్పగా మెచ్చుకున్నారు.

—కోనే నాగ వెంకట అంజనేయులు



## పారిజాతం

పారిజాతపుష్పం పేరు వినగానే మనకు—శ్రీకృష్ణుడు భార్య సత్యభామ కోరిక నెరవేర్చడానికి, స్వర్గానికి వెళ్ళి, పారిజాత వృక్షాన్ని సమూలంగా పెకలించి, గరుడ వాహనం మీద తీసుకువచ్చి భూమి మీద నాటిన 'పారిజాతాపహరణం కథ' గుర్తుకు వస్తుంది!

అదే విధంగా ఈ పుష్పానికి సంబంధించిన మరొక కథ కూడా ప్రాచుర్యంలో ఉన్నది. పారిజాతం అనే పేరుగల ఒక రాకుమారి సూర్యుణ్ణి ప్రేమించిందట. రాత్రి కాగానే సూర్యుడు కనిపించకపోయేసరికి, బాధతో కుమిలిపోయి, ప్రాణాలు వదిలిందట. ఆమె చితాభస్మం నుంచి పుట్టిన మొక్కే పారిజాతమయిందట. ఆ చెట్టు పూచే పూలు సూర్యుణ్ణి చూడలేక తెల్లవారేసరికల్లా రాలి పోతాయట. అందుకే దీనికి 'విషాదవృక్షం' అనే పేరు కూడా వచ్చింది.



వృక్షశాస్త్రంలో దీనిని 'నిక్టాంథెస్ ఆర్బార్ – ట్రిస్టిస్' అంటారు. రాత్రి పుష్పం, విషాద వృక్షం అని దీనికి అర్థం. ఉత్తర భారతదేశంలో దీనిని 'రాత్–కీ–రాణి' అంటారు.

మంచి వాసనగల తెల్లటి రేకులూ, నారింజరంగు తొడిమా గల చిన్న చిన్న పారిజాతం పువ్వులు తెల్లవారేసరికల్లా రాలిపోతాయి.

పారిజాతం చెట్టు మనదేశం అన్ని ప్రాంతాలలోనూ ఉన్నది. ఇది మరీ ఎత్తుగా పెరగదు గాని గుబురుగా ఉంటుంది. ఆకులు మొనదేలి ఒకదానికొకటి ఎదురుగా జతలు జతలుగా ఉంటాయి. పై భాగం కాస్త గరుకుగానూ, అడుగు వైపు మృదువుగానూ ఉంటుంది. పువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి.




# సుప్రసిద్ధ మత గ్రంథాలు

## మహావీరుడి బోధనలు

వర్ధమాన మహావీరుడు, గౌతమ బుద్ధుడి లాగానే, ఆయనకు దాదాపు ఆరు వందల సంవత్సరాలకు పూర్వం, వైశాలీ సమీపంలోని ఒక రాజకుటుంబంలో జన్మించాడు. మహావీరుణ్ణి జినుడు, అంటే ఇంద్రియాలను జయించినవాడు అని అంటారు. జినుడు బోధించిన మతం జైనమతంగా ప్రసిద్ధిగాంచింది.

మహావీరుడు ఆయనకు పూర్వులయిన ఇరవై మూడు మంది తీర్థంకరులు బోధించిన బోధలను క్రోడీకరించి, ప్రజలకు బోధించాడు. ఆ విధంగా ఆయన ఇరవై నాలుగవ తీర్థంకరుడు. మహావీరుడు పన్నెండేళ్ళపాటు నిర్విరామధ్యానంలో గడిపి 'కైవల్య'మనే ఉత్తమ జ్ఞానాన్ని పొందాడు.

మహావీరుడి బోధనలను – అంగాలు, పూర్వాలు, ప్రకరణాలు మొదలైన సంకలనాలలో పొందుపరచారు. వినయ - విజయులు సంకలనం చేసిన 'లోక ప్రకాశ' అనే గ్రంథం కూడా జైనమత సిద్ధాంతాలను విపులీకరిస్తుంది.

మహావీరుడు కఠోరమైన సన్యాస జీవితాన్ని ఆచరించి, నిర్మలానందం పొందే మార్గం చూపాడు. జనన మరణాలు లేని స్థితిని పొందినప్పుడే అది సాధ్యమవుతుంది. సమ్యక్ జ్ఞానం, సమ్యక్ దర్శనం, సమ్యక్ చరిత్ర అనే త్రిరత్నాలను ఆచరిస్తే ఆ స్థితిని పొందవచ్చు.

కర్మ, పునర్జన్మ, తపస్సు ద్వారా జన్మ విముక్తి అంటే మోక్షం పొందడం -- మొదలైన

సిద్ధాంతాలలో జైనమతానికీ, హిందూమతానికీ అభిప్రాయ భేదాలు లేవు. జైనమతం అహింస, అపరిగ్రహం అనేకాంతం అనే మూడు అంశాలకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తుంది. వాటిలో అహింసకు ప్రథమ స్థానం. మనిషి చేతలనుంచే కాకుండా ఆలోచనల నుంచే హింసను తొలగించాలని జైనమతం బోధిస్తుంది. అపరిగ్రహం అంటే ప్రాపంచిక విషయబంధాలను తెంచుకోవాలని కూడా జైనమతం చెబుతుంది. అందుకే మహావీరుడు బట్టలు కూడా వదిలేశాడు. జైనమతం ప్రకారం ఆహారంకూడా ఒక బంధమే. ఆహారం ముట్టుకోకుండా, ఈలోకంతో పాటు ప్రాణాలు త్యజించే జైనులు కూడా ఉన్నారు!

మహావీరుడి నిర్యాణానంతరం జైనులు దిగంబరులు, శ్వేతంబరులు అనే రెండు శాఖలుగా విడిపోయారు.

దిగంబరులు దుస్తులు కూడా ధరించకుండా కఠినమైన నియమాలను తూచా తప్పకుండా పాటిస్తారు. శ్వేతంబరులు తెల్లటి దుస్తులు ధరిస్తారు.



# మీకు తెలుసా?

1. 'తటాకాల నగరం'గా ప్రసిద్ధిగాంచిన భారతీయ నగరం ఏది?
2. ఒక సుప్రసిద్ధ అంగ్ల రచయిత, రాస్తున్నప్పుడు భుజం మీద తన పెంపుడు పిల్లిని కూర్చో బెట్టుకునే వాడు. ఆయన ఎవరు?
3. అరేబియా సముద్రం — బంగాళాఖాతం మధ్య సింధుశాఖలో వున్న ద్వీపం ఏది? సింధుశాఖ పేరేమిటి?
4. ప్రయాణం చేసేప్పుడు తన పెంపుడు జంతువులన్నిటినీ వెంటబెట్టుకుని వెళ్ళే అలవాటుగల సుప్రసిద్ధ ఆంగ్లకవి ఎవరు?
5. మనదేశంలో 'కదిలే శిఖరాలు' ఎక్కడున్నాయి?
6. వివిధ భాషలు నేర్చిన సుప్రసిద్ధ 'అద్భుతకథల' రచయిత ఎవరు?
7. బుద్ధుడు జన్మించిన లుంబినీవనం ఈనాటి పేరు ఏమిటి?
8. 'పాకిస్తాన్' అనే పేరును రూపొందించిన వారెవరు? ఎప్పుడు?
9. అతి ప్రాచీనమైన ఈజిప్టు గ్రంథం ఏది? అది ఏనాటిది?
10. ప్రపంచంలోకెల్లా పంచదారను అత్యధికంగా ఉత్పత్తి చేసే దేశం ఏది?
11. ప్రపంచంలో ఎక్కువ మంది మాట్లాడే భాష ఏది?
12. 'పాత నిబంధనల'లోనూ 'కొత్త నిబంధనల'లోనూ ఉన్న 'గ్రంథా'లెన్ని?
13. క్రీ.పూ. 4వ శతాబ్దంలో మనదేశానికి వచ్చి, తన ప్రయాణ అనుభవాలను రాసిన పాశ్చాత్య యాత్రికుడు ఎవరు?
14. అశోక చక్రవర్తి తన రాయబారులను పంపినప్పుడు శ్రీలంకను పరిపాలిస్తున్న వారెవరు?
15. అంకగణితం, బీజగణితాలకు సంబంధించిన అతి ప్రాచీన గ్రంథం రాసిన భారతీయుడు ఎవరు? గ్రంథం ఏది?

## సమాధానాలు

1. ఉదయపూర్.
2. ఎడ్గర్ అల్లెన్ పో.
3. రామేశ్వరం. మన్నార్ సింధుశాఖ.
4. లార్డ్ బైరన్.
5. అహ్మదాబాద్.
6. జాకొబ్ గ్రిమ్.
7. రుమ్మిన్ దేయ్ (నేపాల్).
8. చౌధురి రహ్మత్ అలీ; 1933లో.
9. 'మృతుల గ్రంథం' (క్రీ.పూ. 3,200)
10. భారతదేశం.
11. చీనా భాష.
12. 39; 27.
13. మెగస్తనీస్ (గ్రీసు).
14. దేవానాం ప్రియ తిస్సా.
15. భాస్కరాచార్య; లీలావతి.





# సరస్వతి తెలివి

శ్రీపతి అనేవాడికి తను చాలా తెలివైన వాడినని నమ్మకం. ఒకరోజున వాళ్ళింటికి వాడి మేనమామ వచ్చి, "నువ్వు చాలా తెలివైన వాడివికదా! గుంటగలగరాకుపసరును నుదుటికి పూసుకుని, ఏమంత్రం చదివితే భూమిలోని నిధి నిక్షేపాలు కనబడతాయో చెప్పు!" అని అడిగాడు.

ఇది విని శ్రీపతి నవ్వాపుకోలేకపోయాడు. తర్వాత వాడు, "భలేవాడివి మామయ్యా! మంత్రాలను నువ్వు నమ్ముతావా?" అని అడిగాడు.

మేనమామ దిగులుగా, "నీ తెలివి నా కూతురుకుంటే బాగుండేది. అది ఇలాంటి మాటలన్నీ నమ్మడమే కాక ప్రచారం కూడా చేస్తుంది," అన్నాడు.

శ్రీపతి మేనమామ కూతురు పేరు సరస్వతి. చక్కని చుక్క. ఆమెను శ్రీపతికిచ్చి పెళ్ళి చేద్దామని కూడా అనుకున్నారు. కానీ సరస్వతి అమాయకురాలనీ, తను తెలివైనపిల్లనే పెళ్ళి చేసుకుంటాననీ శ్రీపతి పట్టు పట్టాడు.

"ఏం చేస్తాం? కొందరు తెలివితక్కువ తనంతో పుడతారు," అని జాలిపడ్డాడు శ్రీపతి.

మేనమామ తల అడ్డంగా వూపి, "తెలివి తక్కువదని దాన్నెలాగంటాను? అది నమ్మినదాన్ని కాదని ఒప్పించడం ఎంత తెలివైన వాళ్ళకీ సాధ్యపడదే?" అన్నాడు.

ఇది శ్రీపతికి సవాలుగా తోచింది. వాడు వెంటనే బయల్దేరి మేనమామ ఊరు వెళ్ళి, సరస్వతిని కలుసుకుని, "నువ్వు అడ్డమైనవన్నీ నమ్మకు. అంతా వేళాకోళం చేస్తారు," అని నెమ్మదిగా చెప్పాడు.

"నేను తెలివైనదాన్ని. అడ్డమైనవీ నమ్మను. నమ్మాల్సినవే నమ్ముతాను," అన్నది సరస్వతి.

రామాయణం, భారతం వంటి పురాణేతిహాస గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదవాలన్నాడు శ్రీపతి. అయితే సరస్వతి అప్పటికే అవన్నీ

జొన్నలగడ్డ రామలక్ష్మి

చాలా చదువుకుంది. కొన్ని ప్రశ్నలు వేసి, ఆమె పరిజ్ఞానానికి ఆశ్చర్యపోయాడు శ్రీపతి.

"మరి నేను తెలివైనదాన్నేనా?" అని అడిగింది సరస్వతి.

"పురాణాలు చదివితే సరిపోదు. లెక్కలు బాగా తెలియాలి. జీవితంలో లెక్కల అవసరం చాలా వుంటుంది. గణిత శాస్త్రంవల్లనే మెదడు పదునెక్కుతుంది," అన్నాడు శ్రీపతి.

సరస్వతికి గణితశాస్త్రంలోనూ ప్రావీణ్యముంది. ఆమెను పరీక్షించిన శ్రీపతి, "అమ్మో!" అనుకున్నాడు. అతడి కర్థంకాని క్లిష్ట సూత్రాలను కూడా అమె అర్థం చేసుకోగలిగింది.

"చదువొక్కటి సరిపోదు. లోకజ్ఞానం వుండాలి. అదుంటే అడ్డమైనవాళ్ళూ చెప్పినవి నమ్మవు," అన్నాడు శ్రీపతి.

"అలా నేనేం నమ్మాను?" అన్నది సరస్వతి ఆశ్చర్యంగా.

శ్రీపతి గుంటగలగరాకు కథ చెప్పాడు. ఆమె నవ్వి, "నీకు తెలియదా? అది నిజంగా నిజం. ఆ విషయం రాధ చెప్పింది. రాధ ఎన్నడూ అబద్ధం చెప్పదు," అన్నది.

"ఆ రాధ నిన్ను ఆటపట్టించింది. ఎందుకంటే — ఇలాంటి విషయాలు నువ్వు తప్ప ఇంకెవ్వరూ నమ్మరు కదా!" అన్నాడు శ్రీపతి.

"రాధ నాకు మంచి స్నేహితురాలు. దానికి పెళ్ళయి ఏడాదయింది. ఆర్నెల్ల క్రితం భర్త దాని కీవిషయం చెప్పాడు. భర్త భార్యకు అబద్ధం చెబుతాడా?" అన్నది సరస్వతి అమాయకంగా.



"ఏమో, నీలాంటి భార్య అయితే, ఏ భర్తయినా అబద్ధం చెబుతాడు. అయినా, ఇలాంటి విడ్డూరాలను నమ్మేదెలా?" అన్నాడు శ్రీపతి.

"అయ్యో! ఇది విడ్డూరం కాదు. ఒక్కసారి రాధ భర్తను కలుసుకో — నీకే తెలుస్తుంది," అన్నది సరస్వతి.

శ్రీపతి, రాధ భర్తను కలుసుకున్నాడు. అతడు శ్రీపతి చెప్పింది విని, "ఆ గుంటగల గరాకు విషయమై మొత్తం ఎనిమిది శ్లోకాలున్నాయి. వాటిని ఒక వరుసలో చదివితేనే ఫలితం కనిపిస్తుంది. ఆ పని ఆడవాళ్ళే చేయాలి. రాధ ఒకరోజున ఆ పని చేయగలిగింది. ఎలుక కన్నంలో నూరు వరహాల మూటను చూసిందామె. పోయిందనుకున్న డబ్బది. రాధ కాప్రభావం గంటసేపుంది. మరొకళ్ళూ మరొకళ్ళూ అయితే, ఇంటి పెరడంతా తిరిగి గంటలో చాలా సాధించే వారు. రాధ నూరు వరహాలతో సంతృప్తి పడి పోయింది. ఆ ఉత్సాహంలో శ్లోకాలు చదవవలసిన వరుసక్రమంమరిచిపోయింది. మళ్ళీ ఆ వరుస కోసంప్రయత్నం మొదలు పెట్టాం. కానీ అందుకు ఎన్నేళ్ళు పడుతుందో ఏమో?" అన్నాడు.

"అన్నాళ్ళెందుకు పడుతుంది?"అని అడిగాడు శ్రీపతి ఆశ్చర్యంగా.

"ముందు మేమూ అలాగే అనుకున్నాం. నీ మరదలికి లెక్కలు బాగా వచ్చు. ఎనిమిది శ్లోకాలను ఎన్ని రకాల వరుసలుగా పేర్చవచ్చా అని అడిగాం. నలభై వేల మూడు





వందల ఇరవై అని చెప్పింది. ఈ శ్లోకాలను అమావాస్యనాడే చదవాలి. ఏడాదికి పన్నెండు అమావాస్యలే కదా! మన అదృష్టం బాగుండక అసలు వరస చివర దాకా దొరక్కపోతే, రెండువేల ఆరు వందల ఎనభై ఎనిమిది సంవత్సరాల దాకా ఎదురుచూడాలని, నీ మరదలు లెక్క కట్టింది. ఇది ఎవరికి వారే సాధించి తెలుసుకోవాలి. ఆ వరుస ఏమిటో ఇంకొకరికి చెబితే, దాని ప్రయోజనం చెప్పిన వారికి లేకుండాపోతుంది," అన్నాడు రాధ భర్త.

"ఆ శ్లోకాల వరుస నేనే కనుక్కుంటాను. నాకా ఎనిమిది శ్లోకాలూ ఏమిటో చెప్పు?" అన్నాడు శ్రీపతి.

రాధ భర్త తాళపత్రాన్ని తెచ్చి శ్రీపతికిచ్చాడు. అది తీసుకుని ఇంటికి వచ్చిన శ్రీపతితో, "బావా! ఇది విన్నావా? మంత్రాలతో ఆవుపేడను బంగారంగా మార్చవచ్చుట! నా స్నేహితురాలు చెప్పింది," అన్నది సరస్వతి.

శ్రీపతి వెంటనే, "ఆ మంత్రాలేమిటో తెలుసుకున్నావా?" అన్నాడు.

"వాటితో నీకు పనేమిటి? ఇలాంటివి నువ్వు నమ్మవుగదా!" అన్నది సరస్వతి ఆశ్చర్యంగా.

"ఏమో — ఏ పుట్టలో ఏ పాముందో ఒకసారి ప్రయత్నించి చూస్తే తెలుస్తుందిగా," అన్నాడు శ్రీపతి.

"నీక్కావాలంటే తెలుసుకుని వస్తాన్లే!" అంటూ మధ్యాహ్నానికల్లా కబురు తీసుకు వచ్చింది సరస్వతి.ఆ కబురు ప్రకారం — బండెడు ఆవుపేడను తెచ్చి పిడకలు చేసి, ఆ పిడకలను హోమం చేయగా వచ్చిన బూడిదను ఒళ్ళంతాపులుముకునిగోదావరిలో స్నానం చేసి రావాలి. తర్వాత మంత్రోచ్చారణ చేస్తూఎంత ఆవుపేడను ముట్టుకుంటే అంత బంగారం తయారవుతుంది!

ఇది చెప్పి సరస్వతి, "బావా! అసలీ ప్రపంచంలోని బంగారమంతా అలాగే తయారయిందని, సీత చెబుతున్నది," అన్నది.

శ్రీపతి ఉత్సాహంగా, సరస్వతి తెచ్చిన తాళపత్రాన్ని తీసుకుని,"నేనేమో ఆవుపేడను బంగారం చేస్తాను. నువ్వేమో నిధి నిక్షేపా

లుండే శ్లోకాల వరుస తెలుసుకో. ఎవరు తమ పనిలో విజయాన్ని ముందుగా సాధిస్తే వాళ్ళు తెలివైనవాళ్ళనిలెక్క!" అంటూ సరస్వతిని సవాలు చేశాడు.

సరస్వతి తల అడ్డంగా ఊపి, "ఇలాంటి పనులతో సమయం వృథా చేసుకునేందుకు నేనేమైనా తెలివితక్కువదాన్నా?" అన్నది.

"మరి నువ్వు వీటిని నమ్ముతున్నావు గదా! అలాంటప్పుడు ఆచరించడానికేం?" అని ప్రశ్నించాడు శ్రీపతి.

"నమ్మడం వల్ల నాకు నష్టంలేదు కాబట్టి నమ్ముతున్నాను. ఆచరంచడం వల్ల నాకు నష్టముంది కాబట్టి, ఆచరించను. ఇంత వరకూ నాకెందరో ఎన్నో చెప్పారు. నేను నమ్మాను. అన్నీ నమ్ముతానని అందరూ అన్నీ నాకే చెబుతారు. నేను నమ్మి వూరుకుంటానంతే! దాన్ని గురించి ఎక్కువ ఆలోచించను. అందువల్ల నేను బోలెడు గ్రంథాలు చదవగలిగాను," అన్నది సరస్వతి.

తన మరదలు తనకంటే చాలా తెలివైనదని అప్పటికి శ్రీపతికి అర్థమయింది. వాడు వెంటనే, "నీకంటె తెలివైనవాడిననుకున్న నేనే, రాధభర్త మాటలు నమ్మి, ఆ శ్లోకాల సంగతేదో చూద్దామనుకున్నాను. అందువల్ల నాకెంతో సమయం వృథా అయ్యేది కదా!ఎదుటివాళ్ళు అర్థంలేని మాటలు చెబితే విని వూరుకోవాలి తప్ప వాదించడం, నమ్మి ఆచరించడం తెలివితక్కువ. నీకులాగా నమ్మి ఊరుకునేమాటయితే ఈ ప్రపంచంలో ఏదైనా నమ్మవచ్చు.నేనునీకంటేతెలివితక్కువ వాడినని ఒప్పుకుంటున్నాను. మరి నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అని ఆమెనడిగాడు.

ఇందుకుసరస్వతినవ్వి,"నీమాటలునమ్ముతున్నాను కాబట్టి, నువ్వు తెలివితక్కువ వాడివేనని నేనూ అనుకుంటున్నాను. నిన్ను పెళ్ళి చేసుకోవడంవల్ల నాకు నష్టంలేదుకాబట్టి అందుకు ఒప్పుకుంటున్నాను," అన్నది.

తన కూతురు తెలివిని ఋజువు చేయడానికే మేనమామ తనను సవాలు చేశాడని అప్పటికి శ్రీపతి గ్రహించినా -- అంత తెలివైన భార్య తనకు లభించడం అదృష్టమే అనుకుని సంతోషించాడు.





# శకునఫలం

పూర్వం చంద్రగిరి అనే రాజ్యాన్ని చంద్రవర్ధనుడు అనే రాజు పాలించేవాడు. ఆయనకు నెలకొకసారి అయినా అడవికి వెళ్ళి క్రూర మృగాలను వేటాడాలని కోరికగా వుండేది. అయితే, ఒకసారి ఆరు నెలలు గడిచినా, రాచకార్యాలలో తలమునకలైపోవడం వల్ల, ఆయనకు వేటకు వెళ్ళే అవకాశం చిక్కింది కాదు.

చివరి కొకనాడాయన కొంచెం తీరుబాటు చూసుకుని,ఒక శుభముహూర్తాన పరివారాన్ని వెంటబెట్టుకుని, కోట నుంచి బయటకు రాగానే, ఆ సమీపంలో వున్న పాకలోంచి కట్టెలు కొట్టేవాడొక భుజాన గొడ్డలితో ఎదురు వచ్చాడు.

చంద్రవర్ధనుడు, వాణ్ణి ఆపి, "ఒరే, మతిమాలిన వెధవా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకో నేను వేటకు పోతుంటే తగుదునంటూ ఎదురొచ్చావు. నీది దుశ్శకునమై, వేట బాగా సాగక పోయిందో, తిరిగొచ్చాక నీ చర్మం ఒలిపిస్తాను," అన్నాడు.

ఆ కట్టెలుకొట్టేవాడి పేరు చింపిరయ్య. వాడు తన కర్మకాలి రాజుకు ఎదురైనందుకు, తనను తాను తిట్టుకుంటూ, రాజుగారి వేట బహుగొప్పగా సాగాలని దేవుడికి మొక్కుకుని, వాడూ అడవికి వెళ్ళాడు.

ఆ రోజు చంద్రవర్ధనుడివేటబ్రహ్మాండంగా సాగింది. ఆయన ఒక సింహాన్నీ, నాలుగు పులుల్నీ,కొన్ని అడవిపందుల్నీసునాయాసంగా వేటాడాడు. ఇదంతా తనకు కోట సమీపాన ఎదురైన కట్టెలుకొట్టేవాడి శకునఫలితం అనుకుని, ఆయన మర్నాడు చింపిరయ్యను సభకు పిలిపించి, "ఒరే,నువ్వు, వేటకు వెళ్ళే నాకు కోటగుమ్మాన ఎదురవడంవల్ల, అడవిలో నా వేట ఎన్నడూ లేనంత గొప్పగా సాగింది. సరే, నువ్వూ అడవికి వెళ్ళావుగదా? నీ అనుభవం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

మల్లవరపు మనోహరరెడ్డి

చింపిరయ్య రాజుకు నీరసంగా నమస్క రించి, "ప్రభూ! నిన్న తామెదురవడం వల్ల, ఏనాడూ లేనిది నా గొడ్డలి వేటుకు మహా వృక్షాలు, మునగ కొమ్మల్లా తెగి నేలకూలినై. ఆ విధంగా నాకు నిన్న కట్టెలమ్మగా రెట్టింపు రాబడి వచ్చింది. మహాప్రభువులైన తమ పేరు ఒకటికి రెండుసార్లు చెప్పుకుని, నేనూ, నా భార్యాబిడ్డలూ కడుపునిండాతిండితిన్నాం," అన్నాడు.

ఇది విన్న రాజు చంద్రవర్ధనుడు పరమా నందంచెంది ఏదో అనబోయేంతలో, దాపుల నున్న రాజవైద్యుడులేచి, "మహా రాజా! వీడు చెప్పింది పచ్చి అబద్ధం. నిన్న వీడు ప్రాణా పాయ స్థితిలో అడవిలో పడివుంటే, సమయా నికి నేను చికిత్స చేసి బతికించాను," అన్నాడు.

రాజు మండిపడి, "ఏరా, పొగరుబోతా! నాకే అబద్ధం చెబుతావా? అసలేం జరిగిందో వున్నది వున్నట్టు చెప్పకపోయావో, నిలువునా నీ చర్మం ఒలిపించడమే కాదు, ఆ తర్వాత శిరశ్ఛేదం చేయిస్తాను," అన్నాడు.

దానితో చింపిరయ్య గజగజ వణికిపోతూ జరిగింది ఇలా చెప్పాడు:

అడవికి కట్టెల కోసం బయలుదేరిన చింపి రయ్యకు, రాజు ఎదురై హెచ్చరించడంతో మనసు మనసులో లేదు. వాడు అడవి చేరు కుని, ఒక చెట్టును నరక దలచి పరధ్యానంగా, దాని మొదలు దగ్గిరున్న పుట్ట మీద కాలు వేశాడు. ఆ మరుక్షణం అందులో వున్న తాచు పాము వాణ్ణి కాటు వేసింది. వాడు నురుగులు కక్కుకుంటూ కుప్పకూలిపోయాడు.



ఆ సమయంలో, వనమూలికల కోసం అడవికి వచ్చిన రాజవైద్యుడి కంటబడ్డాడు చింపిరయ్య. వెంటనే రాజవైద్యుడు అక్కడ దొరికిన ఆకులతో, వాడికి పసరు వైద్యం చేసి, నెత్తి కెక్కిన విషాన్ని విరిచేశాడు. తర్వాత నీరసంతో అడవిలోనే చీకటిపడే వరకూ పడివుండి, రాత్రి ఎప్పటికో ఇల్లు చేరుకున్నాడు చింపిరయ్య.

జరిగింది విని రాజు చంద్రవర్ధనుడు బాధపడుతూ, "కోట గుమ్మంలో నేను ఎదురు పడిన శకునం కారణంగా అడవిలో పాము కాటుకు గురైకూడా, మంచి జరిగిందని నాతో ఎందుకు అబద్ధం ఆడావు?" అని అడిగాడు.

"ఏలిన వారు క్షమించాలి! నా దురదృష్టం కొద్దీ అడవిలో ఏదో జరిగినదానికి, మీరు ఎదురు పడడం వల్ల జరిగిందని చెప్పి, సభ వారి ముందు మిమ్మల్ని చులకనచేయడం ఇష్టంలేక, అలా అబద్ధం ఆడాను," అన్నాడు చింపిరయ్య ఎంతో వినయంగా చేతులు జోడిస్తూ.

"అయితే, నాశకునకారణంగానే, అడవిలో నిన్ను పాము కరిచిందని, ఇప్పుడు తెలిసి పోయింది కదా! సభముందు నాగౌరవమర్యాద లేమయినట్టు?" అని గద్దిస్తూ అడిగాడు రాజు చంద్రవర్ధనుడు.

"ప్రభువులు మన్నించాలి! ఊళ్ళో జబ్బు చేస్తేనే వైద్యానికి గతిలేని వాణ్ణి. అలాంటి దరిద్రుణ్ణి, కారడవిలో పాము కరిస్తే, రాజ వైద్యుడంతటివాడితో వైద్యం చేయించుకో గలిగానంటే, అది తమరెదురైన శకునం మహ త్యమే గదా! ఈచిన్నసంగతి శాస్త్రాలూ, పురా ణాలూచదివినసభవారికితెలియదా?" అన్నాడు చింపిరయ్య.

ఇది విని రాజుతో పాటు సభలో వున్న వారందరూ పెద్దగా నవ్వారు. రాజుకు, చింపి రయ్య మాటల్లోని సమయస్ఫూర్తితో పాటు, వాడు శకునాలను వేళాకోళం చేయడంకూడా అర్థమైంది.

ఆయన, వాడికి నూరు బంగారు కాసులు బహూకరించి, తన నౌకర్లలో ఒకడుగా చేర్చు కున్నాడు.






దుష్యంతుడి అనంతరం భరతుడు రాజై, కణ్వమహామునిని పురోహితుడుగా పెట్టుకుని మహావైభవంగా చాలాకాలం రాజ్యపాలన చేశాడు.

భరతుడి మునిమనమడు హస్తి అనేవాడు. ఇతని పేరనే హస్తినాపురం ఏర్పడింది. ఆ హస్తికి అయిదోతరం వాడు కురువు; అతని పేరనే కురుక్షేత్రం ప్రసిద్ధమయింది. కురుడికి ఏడోతరం వాడు ప్రతీపుడు. ఇతని భార్య శిబి కూతురైన సునంద. వీరిద్దరికీ దేవాపీ, శంతనుడూ, బాహ్లికుడూ అనే ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో పెద్దవాడైన దేవాపి తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోవటం చేత అతని తమ్ముడయిన శంతనుడు రాజయ్యాడు.

ఒకనాడు శంతనుడు అరణ్యంలో చాలా సేపు వేటాడి గంగాతీరాన విశ్రాంతి తీసుకుంటూండగా అక్కడ అతని కొక చక్కని స్త్రీ కనిపించింది. ఆమె అద్భుతమైన రూపలావణ్యాలు చూస్తే శంతనుడికి దేవకాంత అనిపించింది. ఆమె కూడా శంతనుణ్ణి చూసి ఆకర్షించబడినదానిలాగా అతన్ని ఆశ్చర్యంతో రెప్పవేయకుండా చూడసాగింది.

ఇద్దరికీ ఒకరి మీద ఒకరికి అభిమానం ఏర్పడ్డట్టు గ్రహించి, శంతనుడు ఆమెను సమీపించి పలకరించి, "సుందరీ, నువ్వెవరు? ఒంటరిగా ఈ గంగాతీరాన ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు.

"నీకు నన్ను పెళ్ళాడాలని మనసయినట్టయితే నాకేమీ అభ్యంతరం లేదు. కాని ఒక్క

## 4. భీష్మప్రతిజ్ఞ



కాని ఆమె ఎనిమిదవసారి మళ్ళీ కొడుకును కన్నప్పుడు, ఆ బిడ్డను చావనివ్వటం ఇష్టంలేక ఆమెను తూలనాడుతూ, "పుట్టిన కొడుకులందరినీ గంగలో వేశావు గదా. ఏ ఆడదైనా ఇలా సొంత బిడ్డలను చేతులారా చంపుకుంటుందా? ఇకనైనా ఈ పుట్టినవాణ్ణి బతికి ఉండనీ. ఇంతకూ నువ్వెవరు? కన్న బిడ్డలందరినీ కనికరం చూపకుండా ఎందుకిలా చంపుతున్నావు?" అని అడిగాడు శంతనుడు పట్టరాని ఆగ్రహంతో.

నియమం ఉన్నది: పెళ్ళయిన తరవాత నేను చేసే పనులకు అభ్యంతరం చెప్పినా, నన్ను నిందించినా, నేను నిన్ను విడిచి వెళ్ళిపోతాను," అన్నది ఆ స్త్రీ.

అందుకు సమ్మతించి శంతనుడామెను భార్యగా పరిగ్రహించాడు.

వారి దాంపత్యంలో ఆమెకు వరసగా మగపిల్లలు కలుగుతూ వచ్చారు. పుట్టిన పిల్లలను పుట్టినట్టే ఆమె గంగలో పడేస్తూ వచ్చింది. ఇది శంతనుడికి చాలా బాధ కలిగించింది. కాని తాను ఇందుకు అభ్యంతరం చెబితే ఆమె తనను విడిచి పోతుందని భయపడి, ఏడుగురు కొడుకులను వరుసగా గంగపాలు కానిచ్చాడు.

"నీకు కొడుకు కావాలని ఉంటే వీణ్ణి చంపకుండా నీకిస్తాను. నాకు అడ్డు చెప్పావు గనక నేనిక నిన్ను విడిచి వెళ్ళిపోతాను. నేనెవరిననీ, నా పిల్లలను ఎందుకు చంపాననీ అడిగావు. చెబుతాను విను. నేను గంగను. వసిష్ఠుడు అష్టవసువులను మనుషులుగా పుట్టమని శపించగా, వారు నన్నూ, నిన్నూ తల్లిదండ్రులుగా కోరుకున్నారు. వారి కోసమే నేను స్త్రీరూపం ధరించి నిన్ను చేరి ఇన్నాళ్ళూ నీకు భార్యగా ఉన్నాను. నా గర్భాన పుట్టిన వసువులను త్వరలోనే వారి లోకానికి పంపగలందులకు వీలుగా పుట్టగానే చంపేస్తూ వచ్చాను. నీకు కొడుకు లేకుండా పోతాడేమోనని వీణ్ణి నీ కోరిక ప్రకారం బతకనిస్తున్నాను," అన్నది గంగ.

అయితే, గంగ ఆ కొడుకును శంతనుడికివ్వక, వాడితో సహా ఆ క్షణమే అంతర్థానమయింది.

భార్యాపుత్రు లిద్దరినీ పోగొట్టుకున్న విచారంతో శంతనుడు హస్తినాపురానికి తిరిగి వచ్చాడు. కొంత కాలం గడిచింది. ఒకనాడు అతను వేటాడుతూ గంగా తీరానికి వచ్చి, గంగా ప్రవాహం చాలా సన్ననిపాయగా ఉండటంచూసి ఆశ్చర్యపడ్డాడు. కారణం ఏమిటా అని పరిశీలించగా, ఒక యువకుడు బాణాలువేసి గంగా ప్రవాహానికి ఆనకట్ట కడుతూండటం శంతనుడి కంటపడింది.

అప్పుడు గంగ తన పూర్వ రూపంలో శంతనుడి ముందు కనబడి, ఆ కుర్రవాణ్ణి చూపి, "వీడు నేను నావెంట తెచ్చుకున్న నీ ఎనిమిదో కొడుకు. ఇంత కాలమూ నేను వీణ్ణి సక్రమంగా పెంచి పెద్దచేశాను. వీడు వసిష్ఠుడి వద్ద వేదవేదాంగాలు నేర్చుకున్నాడు, పరశురాముడి వద్ద ధనుర్విద్య నేర్చుకున్నాడు. వీడి పేరు దేవవ్రతుడు. ఇక నువ్వు వీణ్ణి తీసుకుపో," అన్నది.

శంతనుడు దేవవ్రతుణ్ణి తన వెంట హస్తినాపురానికి తీసుకుపోయి, యువరాజును చేసి చాలా సంతోషించాడు.

నాలుగు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు శంతనుడు యమునా తీరానికి విహరించబోయాడు. అక్కడ అతనికి అపూర్వమైన సువాసన తగిలింది. ఆ వాసన వచ్చిన దిక్కుగావెళ్ళి, ఒక అపురూప సుందరి శరీరం నుంచి ఆ సుగంధం వస్తున్నట్టు తెలుసుకుని, శంతను డామెను ఆశ్చర్యంతో పలకరించి, "నువ్వెవరు? ఎవరి కూతురువు?" అని అడిగాడు.





"నేను దాశరాజు కూతుర్ని. నా పేరు మత్స్య గంధి. నన్ను యోజనగంధి అని కూడా పిలుస్తారు. నా తండ్రి ఆజ్ఞాపించగా నేనిక్కడ తెప్ప నడుపుతూ, మనుషులను నది దాటిస్తాను," అన్నదామె.

వెంటనే శంతనుడు దాశరాజున్న చోటికి వెళ్ళి, "నీ కూతుర్నినాకిచ్చి పెళ్ళిచెయ్యి," అని అడిగాడు.

"నీ వంటి అల్లుడు దొరికితే అంతకన్న నాకేం కావాలి? అయితే, ఒక విషయం నా కూతురికి పుట్టబోయే కొడుకు నీ అనంతరం రాజయ్యేటట్టుంటే సంతోషంగా నా కూతురి నిచ్చి నీకు ఇప్పుడే పెళ్ళి చేస్తాను," అన్నాడు దాశరాజు.

తన రాజ్యానికి దేవవ్రతుడు అదివరకే యువరాజై ఉండగా ముందు పుట్టబోయేవాడు తన అనంతరం రాజు కావటం పొసగదు. అందుచేత శంతనుడు దాశరాజు చెప్పిన దానికి ఒప్పుకోక మౌనంగా ఇంటికి తిరిగి వచ్చాడు.

కాని, మత్స్యగంధిని పెళ్ళాడలేక పోయి నందుకు పుట్టెడు విచారంలో మునిగి పోయాడు.

దేవవ్రతుడు తండ్రి విచారం గమనించి కారణ మడిగాడు. శంతనుడు దాశరాజు కూతురు మాట చెప్పాడు.

వెంటనే దేవవ్రతుడు పెద్ద పరివారాన్ని వెంటబెట్టుకుని దాశరాజు వద్దకు వెళ్ళి, "నా తండ్రికి నీ కుమార్తెను భార్యగా ఇయ్యి," అని అడిగాడు.

దానికిదాశరాజు, "బాబూ, ఈ పిల్ల ఉపరి చరవసువు కూతురు. ఈ పిల్లను ఆయన నాకిస్తూ, దీనిని తగిన వరుడికిచ్చి చెయ్యమ న్నాడు. దీని పేరు సత్యవతి. అసితుడైన దేవలుడు పెళ్ళాడతానన్నప్పుడు కూడా నేను ఒప్పుకోలేదు. నీ తండ్రి చేసుకుంటానంటే తప్పక ఇస్తాను. కాని నాకు ఒకటే భయం. నువ్వు చూడబోతే మహాయోధుడివి, వీరాగ్రేస రుడివి. సత్యవతికి పుట్టబోయే వాడు నీ ముందు ప్రాణాలతో నిలవటం కల్ల. ఆ భయంతోనే ఈ పెళ్ళికి వెనకాడుతున్నాను," అన్నాడు.

అప్పుడు దేవవ్రతుడు దాశరాజుతో, "అలా అయితే నా ప్రతిజ్ఞ విను. నాకు నా తండ్రి రాజ్యం అక్కర్లేదు. సత్యవతికి పుట్టబోయే వాడే అందరితో బాటు నాకూ రాజుగా ఉం టాడు. అందరి ఎదటా నేనీ శపథం చేస్తు న్నాను," అన్నాడు.

దాశరాజు దేవవ్రతుడితో, "ఇలాటి ప్రతిజ్ఞ అందరూ చెయ్యగలరా? నువ్వు రాజ్యత్యాగం చేసినా నీ సంతతి ఊరుకోవద్దా?" అన్నాడు అనుమానంగా.

దానికి దేవవ్రతుడు, "దాశరాజా, రాజ్య త్యాగం చేస్తున్నానని ప్రతిజ్ఞ చేశాను. నా సంతతి గురించి భయపడుతున్నావు గనక, నేను వివాహమే చేసుకోనని మరొక ప్రతిజ్ఞ చేస్తున్నాను. నాకు పిల్లలే ఉండరు. ఇక నిర్భయంగా సత్యవతిని నా తండ్రికిచ్చి పెళ్ళి చెయ్యి," అన్నాడు.

దాశరాజు తృప్తిపడి శంతనుడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు. ఇలా భీష్మమైన ప్రతిజ్ఞ చేసిన కారణంగా దేవవ్రతుడికి భీష్ము డనే పేరు సార్థకమయింది.

శంతనుడు సత్యవతి యందు చిత్రాంగ దుడూ, విచిత్రవీర్యుడూ అనే ఇద్దరు కొడుకు లను కని, వారింకా పిల్లలుగా ఉండగానే చనిపోయాడు. భీష్ముడు తండ్రికి ఉత్తరక్రి యలు చేసి, సత్యవతికి చెప్పి, వెంటనే ఆమె పెద్ద కొడుకు చిత్రాంగదుడికి కౌరవ రాజ్యాభిషేకం చేశాడు.



చిత్రాంగదుడు మహా పరాక్రమవంతుడు. అతనికి సాటి రాజులన్నా, వీరులన్నా ఏ మాత్రమూ లక్ష్యం ఉండేది కాదు. అందుచేత అతను అస్తమానమూ దేవతలతోనూ, దానవు లతోనూ, గంధర్వులతోనూ యుద్ధాలు చేసే వాడు.

ఒకసారి చిత్రాంగదుడనే పేరే గల గంధ ర్వుడు ఈ చిత్రాంగదుణ్ణి యుద్ధానికి పిలి చాడు. సరస్వతీనది తీరాన ఇద్దరూ దీర్ఘ పోరాటం సాగించారు. చివరకు గంధర్వ చిత్రాంగదుడు తన మాయాబలంతో కౌరవ చిత్రాంగదుణ్ణి చంపేశాడు.

చిత్రాంగదుడి చావుకు భీష్ముడు ఎంత గానో విచారించి, అతని స్థానంలో విచిత్ర



వీర్యుణ్ణి రాజుగా చేశాడు. అయితే విచిత్ర వీర్యుడికి ఇంకా బాల్యం వీడలేదు. అందు చేత అతని తరపున భీష్ముడే రాజ్య కార్యాలు చూస్తూ ఉండటానికి సత్యవతి అనుమతించింది. విచిత్రవీర్యుడు కూడా భీష్ముడి సలహాలను తూచా తప్పకుండా పాటిస్తూ రాజ్య పాలన చేశాడు.

కాలక్రమాన విచిత్రవీర్యుడికి వివాహ యోగ్యమైన వయసు వచ్చింది. అదే సమయంలో కాశీరాజు తన కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరం జరుపుతున్నానని చాటింపు వేశాడు.

ఈ సంగతి తెలిసి భీష్ముడు సత్యవతితో చెప్పి, రథం మీద కాశీనగరానికి బయలుదేరి వెళ్ళాడు. స్వయంవరానికి అనేకమంది వచ్చి స్వయంవర మందిరంలో చేరారు. భీష్ముడు కూడా అక్కడికి చేరాడు. కాశీరాజు కుమార్తెలకు వచ్చిన వారి వివరాలు చెబుతున్నాడు. భీష్ముడు లేచి, "నేనీ కన్యలను నా తమ్ముడికిచ్చి చెయ్యటానికి తీసుకు పోతున్నాను," అని ప్రకటించి, అంబనూ, అంబికనూ, అంబాలికనూ తన రథంలోకి ఎక్కించుకుని, అక్కడ చేరిన రాజులతో, "ఈ కన్యలను విడిపించటానికి శక్తిగలవారు మీలో ఎవరైనా వుంటే నాతో యుద్ధం చేసి నన్ను జయించండి," అని సవాలు చేశాడు.

అందరూ యుద్ధసన్నద్ధులై ఒక్కసారిగా అతని పైకి వచ్చారు.

భీష్ముడు అంతమంది నుంచీ తనను రక్షించుకోవటమే గాక, కొందరిని చంపాడు. మరికొందరిని గాయపరిచి బీభత్సం కలిగించి కాశీరాజుకూతుళ్ళతో సహా హస్తినాపురానికి బయలుదేరాడు. అందరూ ఓడిపోయాక సాళ్వుడు అతన్ని ఎదిరించి, ప్రాణాలతో తప్పించుకుని పారిపోయాడు.

హస్తినాపురం చేరగానే భీష్ముడు సత్యవతితో సంప్రతించి, కాశీరాజు కుమార్తెలను ముగ్గురినీ విచిత్రవీర్యుడి కిచ్చి పెళ్ళి చేయనిశ్చయించాడు.

అప్పుడు వారిలో పెద్దదైన అంబ, "నేను అదివరకే సాళ్వుణ్ణి వరించాను. అతను కూడా నాపై ప్రేమగా ఉన్నాడు. స్వయంవరం

సక్రమంగా జరిగినట్టయితే నేనతన్ని వరించి ఉండేదాన్ని. కాని నన్ను అసహాయురాలిని చేసి తీసుకువచ్చావు. ఇప్పటికైనా కోరిక చెల్లించటం నీకు ధర్మం," అని భీష్ముడితో అన్నది.

భీష్ముడు మంత్రులతోనూ, పురోహితులతోనూ, పెద్దలయిన బంధువర్గంతోనూ — ఆలోచించి, వారు అనుమతించగా అంబను సాళ్వుడి వద్దకుపంపేసి, అంబికనూ, అంబాలికనూ విచిత్రవీర్యుడికిచ్చి ఘనంగా పెళ్ళి చేశాడు.

అంబికనూ, అంబాలికనూ పెళ్ళి చేసుకున్నాక విచిత్రవీర్యుడు రాజ్యకార్యాలను విడిచిపుచ్చి, తన భార్యలతోనే కాలం గడపసాగాడు. అతనికి కాలక్రమాన క్షయవ్యాధి సంప్రాప్తమై, దానితోనే అతను మరణించాడు.

భీష్ముడు మరొకసారి తన తమ్ముడికి ఉత్తరక్రియలు చేసి, పుత్రశోకంతో విలపించే సత్యవతిని ఓదార్చాడు.

కొంతకాల మయ్యాక సత్యవతి భీష్ముడితో, "నాయనా, మీ తండ్రి వంశాన్ని నిలబెట్టడానికీ, ఆయనకు పిండాలు వెయ్యటానికీ నువ్వు ఒక్కడివే మిగిలావు. ఆపద్ధర్మంగా, అంబికా అంబాలికల యందు నువ్వు సంతానం కను. అది నీకు సమ్మతం కాకపోతే తగిన కన్యను పెళ్ళాడి మన వంశం నిలబెట్టు," అన్నది.

భీష్ముడిందుకు సమ్మతించలేదు. "నేను చేసిన ప్రతిజ్ఞ తప్పను. ఇంద్రపదవి ఇస్తామన్నా నా నిర్ణయం మారదు. నువ్వు ఆపద్ధర్మమని చెప్పేది అక్షరాలా అధర్మం. ఇంకొక ఆపద్ధర్మం ఉన్నది. దాన్నయినా పెద్దలనూ, ఆప్తులనూ, మంత్రులనూ విచారించి మరీ అమలు చెయ్యాలి. ఆ ఆపద్ధర్మమేమిటంటే, వంశం నిలబెట్టడానికి నీ కోడళ్ళు ఉత్తమ బ్రాహ్మణుల ద్వారా సంతానం పొందవచ్చు. పూర్వం పరశురాముడు ప్రపంచంలోని క్షత్రియులందరినీ చంపినప్పుడు, చనిపోయిన వారి భార్యలు బ్రాహ్మణోత్తముల ద్వారా సంతానం పొంది క్షత్రియ వంశాలు నిలబెట్టారు. కాబట్టి మనం కూడా ఇప్పుడు అలాగే చేయవచ్చు," అన్నాడతను.



# బహుమతి గుర్రం!

మగధరాజు మణిభూషణుడికి మహాభారతం అంటే మహాఇష్టం. భారతకథ ఎన్నిసార్లు ఏ రూపంలో విన్నా, ఆ కథ చెప్పిన వారికి ఏదో ఒక బహుమతి ఇచ్చేవాడు.

ఒకసారి మణిభూషణుడు సాయంత్రం ఉద్యానవనంలో తన ముసలిగుర్రం మీద విహరిస్తున్నాడు. అప్పటికే పాండవుల స్వర్గారోహణ పర్వం పద్యరూపంలో గానం చేస్తున్న విదూషకుడు, తన కథ ముగించాడు.

విదూషకుడికి ఏదో ఒక బహుమతి ఇవ్వాలనుకున్న రాజు, తన ముసలి గుర్రాన్ని అతడికి బహూకరించాడు.

రెండో రోజున ఎప్పటిలాగా కాలినడకన వచ్చిన విదూషకుణ్ణి చూసి, "గుర్రమేదీ?" అని అడిగాడు, మణిభూషణుడు ఆశ్చర్యంగా.

"ప్రభూ, ఏం చెప్పేది? పాండవుల స్వర్గారోహణ పర్వం దానికీ నచ్చినట్టుంది! అక్కడ స్వర్గంలో పాండవుల సేవలు చేసుకోవడానికి వెళ్ళింది," అన్నాడు.

బాగా ముసలిదైపోయి చావబోతున్న గుర్రాన్ని ఇవ్వడంతో, అది చనిపోయిందని అర్థం చేసుకున్న రాజు మణిభూషణుడు, మర్నాడు మంచి వయసులో వున్న గుర్రాన్ని విదూషకుడికి దానం చేశాడు.

—ఎం.డి. సౌజన్య





# మైనాకుడి అహంకారం

నిరంజనవరంలోని మైనాకుడికి తాను గొప్ప పండితుడినన్న అహంవుండేది. ఆ అభిప్రాయంతో అతడు ప్రాచీన కవుల గ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివి, అందులో తాను లోపాలనుకున్నవి ఏర్చి కూర్చి, తూర్పారబట్టడమే పనిగా పెట్టుకున్నాడు.

మైనాకుడు పేరొందిన పండిత సభలలో సైతం ప్రశంసలూ, సత్కారాలూ పొందుతూ సౌశీల్యదేశ రాజధాని మలయావతి నగరం చేరాడు.

అక్కడి రాజు సర్వోత్తముడు, కవి పండిత పోషకుడుగా మంచి పేరు తెచ్చుకున్నాడు. ఆయన ఆస్థానంలోని కవి పండితులు దిగ్గజాల వంటివారని ప్రతీతి. మైనాకుడి రాకలోని అంతర్యం తెలుసుకున్న సర్వోత్తముడు, ఒకనాడు నిండు సభలో తన ఆస్థాన పండితులతో వాదించడానికి అతడికి అవకాశం కల్పించాడు.

మైనాకుడి ప్రసంగం వింటూ, పండితులందరూ తాము చదివిన ప్రాచీన కావ్యాలను, అతడు తమకు తెలియని మరొక కొత్త కోణం నుంచి చూసి చెబుతున్నాడా అని ఆశ్చర్యపోసాగారు. వాళ్ళల్లో ఏ ఒక్కరూ అతడిని ఖండించే ప్రయత్నం చెయ్యలేదు.

ఆస్థాన పండితుల మౌనం, ఓటమిగా భావించిన మైనాకుడికి ఎక్కడలేని ఆనందం కలిగింది. సరస్వతీ నిలయమైన సర్వోత్తముడి పండిత సభను జయించడం సామాన్య విషయమేం కాదు!

తన పండితులు మౌనంగా ఓటమిని అంగీకరించడం, రాజు సర్వోత్తముడికి చెప్పరానంత అవమానకరంగా తోచింది. మైనాకుడు తన ప్రసంగాన్ని వెల్లువలా సాగిస్తూనే వున్నాడు. ఆ సమయంలో అతడు కొన్ని సూక్తులను ఉదహరిస్తూ, వాటిలో తను ఊహించిన దోషాలను ఎత్తి చూపసాగాడు.

దాసరి వెంకటరమణ

"సర్వేజనాః సుఖినో భవంతు — అన్నారు పెద్దలు. అలా అనడం శుద్ధ తప్పు. జనులంతా సుఖంగా వుండాలని ఎందుకు కోరుకోవాలి? అందులో దొంగలూ, దోపిడీదారులూ, హంత కులూ వున్నారు. వీళ్ళందరూ సుఖంగా వుండా లని కోరుకుంటే, ప్రపంచం కల్లోలమైపోదా? కావున, వాళ్ళందరినీ మినహాయించి 'సర్వ సాధు జనాః సుఖినో భవంతు' అని వుంటే బాగుంటుంది!" అన్నాడు మైనాకుడు.

సభలో ఒక్కసారిగా కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. అంతా మైనాకుడిని మెచ్చు కోలుగా చూశారు. మైనాకుడు ఒకసారి సభను కలయజూసి, గర్వంగా గొంతు సర్దుకుని ఏదో చెప్పబోయాడు. మొదటి నుంచీ మైనా కుడి ధోరణికి ఎంతో విసుగెత్తి, అతడికి గర్వభంగం చేసే అవకాశం కోసం ఎదురు చూస్తున్న ధరహాసుడనే విదూషకుడు, మైనా కుడి నుద్దేశించి, "నువ్వు చెప్పేది తప్పు!" అన్నాడు గట్టిగా.

సభ ఒక్క క్షణం నిశ్శబ్దమైంది. అంతా ధరహాసుడి వంక చూశారు.

మైనాకుడు, ధరహాసుడికేసి నిర్లక్ష్యంగా చూస్తూ, "ఏమిటా తప్పు?" అన్నాడు కఠినంగా.

"నువ్వు అహంకొద్దీ ఒళ్ళు మరచి, అనాలో చితంగా మాట్లాడుతున్నావు. సర్వేజనాఃసుఖినో భవంతు అన్న సూక్తి శతాబ్దాల శాస్త్రజ్ఞానాన్ని, సంవత్సరాల అనుభవజ్ఞానాన్ని మేళవించి, త్రికాలజ్ఞులైన మేధావులు చెప్పినది. నాకు అవకాశం ఇస్తే, నువ్వు చెప్పింది తప్పు అని నిరూపిస్తాను," అన్నాడు ధరహాసుడు.



మైనాకుడు అతికష్టం మీద తనను తాను నిగ్రహించుకుని, చెప్పమన్నట్టుగా ధరహాసుడి కేసి చూశాడు.

అప్పుడు ధరహాసుడు గంభీరంగా, "అయితే శ్రద్ధగా విను!" అని ప్రారంభించి, "అసలు నిజమైన సుఖం అంటే ఏమిటి? చేతి నిండా ధనం వుండి, చలవరాతి మేడ లుంటే మనిషి సుఖంగా వుండగలుగుతాడా? కాదు. సుఖం అంటే మానసిక ప్రశాంతత. రాక్షస ప్రవృత్తి కలిగిన దొంగలూ, హంతకులూ సుఖంగా వున్నట్టా? ఉండలేరు. కోరినవన్నీ అందుబాటులో వున్నప్పటికీ, వాళ్ళకు రాజ భటుల భయం, ప్రజల భయం! ఏ క్షణంలో ఏమైపోతామో అన్న ఆలోచనలతో మానసిక క్షోభను అనుభవిస్తుంటారు. అలాంటివాళ్ళు కూడాసుఖంగా వుండాలనికోరుకోవడమంటే, వాళ్ళను దుష్ట ప్రవృత్తిని వదలి, సన్మార్గ వర్తులై సుఖప్రదమైన జీవితం గడపమని సూచించడం. అంటే — సర్వేజనాః సుఖినో భవంతు అన్న సూక్తికి అంతరార్థం, ప్రతి మనిషీ నిజమైన సుఖాన్ని కలిగించే తృప్తిని అలవరచుకోమని చెప్పడం!" అంటూ ముగించాడు.

ఆ వెంటనే, అంతవరకు కొనసాగిన దీర్ఘ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ, సభ కరతాళ ధ్వనులతో మార్మోగిపోయింది. మైనాకుడి ముఖం పాలిపోయింది.

ఇది గమనించిన ధరహాసుడు శాంతంగా, "మీరు గొప్ప మేధావులు. అందులో సందేహం లేదు. మీరు ఇంతవరకూ శాస్త్రాల్లో, మహా కవుల రచనల్లో వెలికిరాని ధర్మ సూక్ష్మాలను గుర్తించి, నలుగురికీ అర్థమయ్యేలా చెప్పేందుకు ప్రయత్నించండి. గ్రంథాల్లోని మంచి, చెడుల విషయానికొస్తే — చెడును పక్కకు నెట్టి, మంచిని ఆసరాగా చేసుకోవాలి," అన్నాడు.

మైనాకుడు ఇది విని, మారు మాట్లాడకుండా సభా ప్రాంగణం నుంచి బయటకు వెళ్ళిపోయాడు. అతడి మాటల మాయాజాలం నుంచి బయటపడిన కవిపండితులూ, రాజు సర్వోత్తముడూ, ధరహాసుణ్ణి మనసారా అభినందించారు.



# చందమామ కబుర్లు



## సింహం ప్రాయశ్చిత్తం

గత మే నెలలో కువైట్‌లోని ఒక పట్టణానికి సర్కస్ కంపెనీ ఒకటి వచ్చింది. ఒకనాటి సాయంకాలం ప్రదర్శనలో కొన్ని అంశాలు అయ్యాయి. సీజర్ అనే సింహం బోనులోంచి రింగులోకి వచ్చింది. ఆసరికి శిక్షకురాలు ఎలీనా టిపా అక్కడ వుంది. సింహం ఒకచోటి నుంచి మరొకచోటికి ఎగిరి దూకాలి. అది అలా దూకినప్పుడు కింద పడిపోయింది. ప్రేక్షకులు ఎప్పటిలా చప్పట్లు కొట్ట లేదు. ఆగ్రహం చెందిన సింహం, హఠాత్తుగా లేచి శిక్షకురాలు ఎలీనా గొంతు పట్టి కరిచేసింది. ఆమె అప్పటి కప్పుడే చనిపోయింది. అటుపైన సింహం ఎలీనా శరీరం దగ్గరే పడుకున్నది. కొంతసేపయ్యాక అతికష్టం మీద లేచి బోనులోకి వెళ్ళింది. ఆ తరవాత ఆహారం ముట్టుకో లేదు. నీళ్ళు కూడా తాగకుండా రెండువారాల కల్లా ప్రాణాలు విడిచింది. ఈ సంఘటనను గురించి చెబుతూ సర్కస్ మేనేజర్ సీజర్ టిపా, "బహుశా, అది తాను చేసిన పనికి బాధపడి వుంటుంది. మేము జంతువుల చేత ఆటలాడించగలం కానీ, వాటి మనస్తత్వాన్ని అంతగా అర్థం చేసుకోలేము కదా!" అన్నాడు బాధగా.



## మొసలి ప్రతీకారం!

ఆస్ట్రేలియాలోని కకాడూ నేషనల్ పార్క్ మొసళ్ళకు ప్రసిద్ధిగాంచిన యాత్రా కేంద్రం. అక్కడి మొసళ్ళను చూడడానికి విరివిగా యాత్రికులు వస్తూ వుంటారు. అక్కడ లభించే వంటకాలు కూడా మొసలి మాంసంతో వండినవే. అక్కడ వంటవాడుగా పనిచేసే రాబర్ట్ మినాహన్ అనే యువకుడు మొసలి మాంసం రుచి గురించి తరచూ గొప్పగా చెప్పేవాడు. ఇటీవల అతడు సమీపంలోని ఒక నదిలో ఈదుతూండగా, ఒక మొసలి అతన్ని రుచి చూసి భక్షించబోయింది. సమయానికి ఒక మిత్రుడు వచ్చి, నదిమధ్యంలో వున్న బండ మీదికి అతన్ని నేర్పుగా చేర్చాడు. దాంతో అతడు చావు తప్పి, శరీరం నిండా గాయాలతో మొసలి ప్రతీకారం నుంచి బయట పడ్డాడు!



# దయ్యాలభూమి

ర్వం కోసల సరిహద్దున రంగపురి అనే గ్రామం ఉండేది. అది పేద గ్రామంగా ండటానికి ముఖ్యకారణం ఆ గ్రామానికి ాడుపక్కల ఊబనేల. గ్రామానికి ఉత్తరాన న్న భూమి చాలా మంచిది. చాలా కాలం మస్థులు ఆ భూమిలో పంటలు పండిం రు. కాని పది, పన్నెండేళ్ళ నుంచీ అది డు వేసి పోయింది. అక్కడ దయ్యాలు ాయని గ్రామస్థుల నమ్మకం, అక్కడ వసాయం చెయ్యాలని ప్రయత్నించిన రంతా దయ్యాల మూలంగా కీడుపొం రు. కొందరు బలవన్మరణం చెందారు. కరిద్దరికి పిచ్చి పట్టింది. అటు తరవాత త్తరపు భూమిపైన గ్రామస్థులు ఆశ వదులు న్నారు. అక్కడంతా ముళ్ళపొదలూ, తుప్ప ామొలిచాయి. అసలే పేద గ్రామంగా న్న రంగపురి ఇప్పుడు మరింత హీనస్థితికి చ్చింది.

ఈ గ్రామం నుంచి సుబుద్ధి అనే యువకుడు విద్య నిమిత్తం బాల్యంలోనే కాశీకి వెళ్ళి, అక్కడ అనేక శాస్త్రాలు చదివి, ఎంతో లోకజ్ఞానం గడించి స్వస్థలానికి తిరిగి వచ్చాడు. అతను తిరిగి వచ్చేనాటికి గ్రామం చాలా హీనస్థితిలో ఉన్నది. అతను గ్రామస్థులనందరినీ పిలిచి, "మీరంతా ఉత్తరపుభూమిని ఎందుకు బీడు పెట్టారు? తిండి గింజలు కూడా లేకుండా ఎలా బతుకుతున్నారు?" అని అడిగాడు.

"మేం బతకటం లేదు. క్రమంగా చస్తున్నాం. ఊరు విడిచి పోయేవాళ్ళు ఏనాడో పోయారు. ఉత్తరపు భూమి ఇప్పుడు సాగుభూమి కాదు, దయ్యాలభూమి. ఒక్కొక్క రాత్రి అక్కడ కొరివిదయ్యాలు తిరుగుతాయి. ప్రతి రాత్రీ దయ్యాలు మేనాలు మొయ్యటం వినిపిస్తుంది. మర్రిచెట్టు నిండా దయ్యాలు కనిపిస్తాయి. ఇదంతా పుకారు కాదు; ఊళ్ళో

ప్రతివాడూ కళ్ళారా చూసినదీ, చెవులారా విన్నదీనూ!" అన్నారు గ్రామస్థులు.

వాళ్ళ అజ్ఞానాన్నీ, అమాయకత్వాన్నీ చూసి సుబుద్ధి నివ్వెరపోయాడు. అతను ఊళ్ళో ఎందరినో అడిగి చూశాడు. కొరివిదయ్యాలను దాదాపు ప్రతివాడూ చూశాడు. మేనాల మోతల చప్పుడూ, వెర్రినవ్వులూ విననివాళ్ళు ఒక్కరూ లేరు. ఇద్దరు ముగ్గురు రైతులు దయ్యాలభూమిలో దారుణంగా చచ్చిన మాట కూడా నిజమే.

సుబుద్ధి రాత్రివేళ బయటికి వచ్చాడు. వీధి నిర్జనంగా ఉన్నది. అతను ఉత్తరంగా నడిచి వెళ్ళాడు. ఊరి చివర చేరేసరికి దయ్యాల భూమిలో ఉన్న మర్రిచెట్టు కనబడింది. దాని పైభాగాన తెల్లగా ఏదో ఆడినట్టు అనిపించింది. దానికి ఒక పక్కన గుప్పున పెద్ద మంట లేచి ఆరిపోయింది. ఎవరో వికారంగా నవ్వారు.

సుబుద్ధి కోపంతో పళ్ళు కొరికి, తాను చెయ్యవలిసినదేమిటో ఆ క్షణానే నిర్ణయించుకుని, ఇంటికి తిరిగి వచ్చేసి పడుకున్నాడు.

మర్నాడు అతను మధ్యాహ్న భోజనం చేసుకుని, తనకు కావలసిన వస్తువులన్నీ మూటగట్టుకుని, తాను మరొక చోటికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నట్టు గ్రామంలో అందరికీ చెప్పివచ్చాడు.

"వెళ్ళే వాడివి పొద్దుండగానే బయలుదేరు," అని ఊళ్ళోవాళ్ళు సలహా ఇచ్చారు.

ఇంకో గంటకు సూర్యాస్తమయం అవుతుందనగా సుబుద్ధి దయ్యాల భూమి కేసి





బయలుదేరాడు. కాని అతను ఆ భూమి దాటి పోలేదు. తన మూటను ఒక పొదలో దాచి, మర్రిచెట్టు చుట్టూ ఉండే ప్రదేశమంతా చాలా శ్రద్ధగా పరిశీలించాడు. అతని అను మానం రూఢి అయింది. ఆ ప్రాంతాన మను షులు మసలిన జాడలున్నాయి. ఆ మనుషులు గ్రామస్థులు మాత్రం కాదు.

సూర్యాస్తమయం వేళకు సుబుద్ధి తన మూట విప్పి, అందులో నుంచి నల్లగుడ్డలు తీసి వేసుకుని, మూట పట్టుకుని మర్రిచెట్టు ఎక్కి విశాలంగా ఉన్న పై పంగలో సుఖంగా కూర్చుని, నిద్రలో పక్కకు ఒరిగి పడకుండా కొమ్మలకు తాళ్ళు అడ్డం కట్టుకున్నాడు. బాగా చీకటి పడినాక అతను తాను తెచ్చుకున్న ఆహారం తిని, నీళ్ళు తాగి, "దయ్యాల" కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

రాత్రి ఝామున్నర గడిచినాక కొందరు మనుషులు దయ్యాలభూమిలోకి వచ్చారు. వాళ్ళ కాప్రదేశం బాగా తెలిసినట్టే కనబడింది. వాళ్ళు నలుగురైదుగురు మించి ఉండరు. వాళ్ళు ఒకచోట మంట చేశారు. ఆ మంటలో ఇంత గుగ్గిలం వేశారు. అది భగ్గున మండి ఆరిపోయింది. తరవాత వాళ్ళు ఆ మంట మీద వంట ప్రారంభించారు. మధ్యలో ఒకడు పెద్ద గడ ఒకటి ఎత్తి, దానికి తెల్ల బట్ట ఒకటి కట్టి, మర్రిచెట్టు పక్కగా ఆడించి దించాడు. మధ్య మధ్య ఒకడు నక్కలు అరిచినట్టు అరిచాడు. ఇంకొకడు వికారంగా నవ్వాడు.

ఈ విధంగా వాళ్ళు అర్ధరాత్రి దాటిన దాకా దయ్యాలాటలు ఆడారు. మూడో ఝాములో మరి పదిమంది వచ్చి చేరారు. వాళ్ళు ఏవేవో మూటలు తెచ్చినట్టు సుబుద్ధికి తోచింది. వాళ్ళు పొయ్యిలో నుంచి కొరివి ఒకటి తీసుకుని తిన్నగా మర్రిచెట్టు కిందికి వచ్చి, అక్కడ ఉన్న ఒక పెద్ద బండరాయిని పక్కకు తొలిగించి, గొయ్యి తీశారు. కొంత మట్టి తీశాక అడుగున ఇంకా చాలా మూట లున్నట్టు సుబుద్ధి గమనించాడు. వాళ్ళు తాము తెచ్చిన మూటలను వాటితో చేర్చి, వాటిపైన మళ్ళీ మట్టి కప్పి, బండరాయిని యథాస్థానంలో పెట్టారు. మళ్ళీ కాస్సేపు

దయ్యాలాట ఆది, అందరూ సరిహద్దు కేసి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిపోయాక సుబుద్ధి నిద్రపోయాడు. అతనికి మెలకువ వచ్చేసరికి బారెడుపొద్దెక్కింది. అతను చెట్టుదిగి గ్రామం లోకి తిరిగి వచ్చాడు.

"వెళ్ళిపోతానని బయలుదేరితివే? అప్పుడే ఎలా తిరిగి వచ్చావు?" అని గ్రామంలో వాళ్ళు అతన్ని అడిగారు.

"నే నెక్కడికి వెళ్ళాను? రాత్రంతా దయ్యాల భూమిలో ఉన్నాను. దయ్యాలతో కాలక్షేపం చేశాను," అన్నాడు సుబుద్ధి.

"దయ్యాలు నిన్ను ప్రాణాలతో వది లాయా?" అన్నారు గ్రామస్థులు.

"అవీ మనవంటి దయ్యాలే. మనమంతా తలుచుకుంటే మన వల్ల వాటికే ప్రమాదం. మీకు ఒక చిత్రం చూపిస్తాను, నా వెంట రండి," అన్నాడు సుబుద్ధి.

అతను రమ్మంటున్నది దయ్యాలభూమి కని తెలిసి చాలామంది భయపడ్డారు. ధైర్యం గలయువకులను అయిదారు గురిని మాత్రం వెంట బెట్టుకుని అతను వారితో దయ్యాల భూమి అంతా మిట్ట మధ్యానం వేళ తిరి గాడు.

"ఇదుగో దయ్యాలు వంట చేసుకునే పొయ్యిరాళ్ళు. ఇదుగో కాలిన కట్టెల బూడిద. ఇదుగో గుగ్గిలం పొడి. మంటల్లో విసిరిన ప్పుడు చెదిరి పక్కన పడింది.పొయ్యి మంట లోగుగ్గిలం వేస్తే అదే కొరివిదయ్యం! తెలి సిందా?దయ్యాలువంటచేసుకుతింటాయా? మీరు దయ్యాలనుకునే వాళ్ళు దొంగలు.



అంతా కలిసి పదిహేనుమంది దాకా ఉన్నారు. మర్రిచెట్టు మీద దయ్యాలు ఆడటం ఏమిటో తెలుసా? పెద్ద కర్రకు బట్ట ఒకటి కట్టి ఆడించారు. ఈ మర్రిచెట్టు మీద ఉండి రాత్రి వాళ్ళు ఆటలన్నీ చూశాను. వాళ్ళు సరి హద్దు అవతల అడవుల్లో వుంటారని నా అను మానం. రాత్రి పూట దొంగతనాలు చేసి తెచ్చి, దాన్ని ఈ మర్రిచెట్టు దగ్గరే, ఈ రాయి కిందే పాతేస్తున్నారు.పట్టండి,రాయిపక్కకు ఎత్తండి," అన్నాడు సుబుద్ధి.

అందరూ కలిసి ఎత్తిన మీదట రాయి లేచింది. దాని కింద తవ్వేసరికి చిన్న, పెద్ద మూటలు దాదాపు నూరుదాకా దొరికాయి. సుబుద్ధి వాటిని గ్రామంలోకి మోయించుకు పోయాడు. గ్రామస్థులంతా చేరారు. సుబుద్ధి చెప్పినదంతా విన్నారు. అతని మాటలలో వారికి గురి కుదిరింది.

"పన్నెండేళ్ళుగా మన గ్రామాన్ని పాడు పెట్టిన ఈ దొంగలను మనం కఠినంగా శిక్షిం చాలి. వీళ్ళను పట్టుకుని, పొరుగు రాజుకు అప్పగించుదాం. ఈ దొరికిన దొంగసొమ్ము కూడా రాజుకే ఇచ్చేసి, వారేం బహుమానం ఇస్తేఅదిపుచ్చుకుందాం.అటుతరవాత మన ఉత్తరపు భూమిని మనం ఉమ్మడిగా వ్యవ సాయం చేసుకుందాం," అన్నాడు సుబుద్ధి.

ఆ రాత్రి మూడో ఝామున దొంగలు మర్రిచెట్టు కింద రాయి ఎత్తి, మట్టి తవ్వి తమ సంచులు లేకపోయినందుకు నిర్ఘాంత పోయి ఉండగా, యాభైమంది గ్రామస్థులు కర్రలతో వాళ్ళపైన పడి, చావబాది, పొరుగు రాజ్యానికి తీసుకుపోయారు.

పొరుగురాజు దొంగలు దొరికినందుకు చాలా ఆనందించాడు. సరిగా పన్నెండేళ్ళ నుంచీ దొంగతనాలు జరుగుతున్నాయి. దొంగ లనూ, దొంగసొత్తునూ పట్టుకోవడంలో ప్రధాన పాత్ర వహించిన సుబుద్ధికి రాజు గొప్ప బహుమానం ఇచ్చాడు. గ్రామానికి అయిదు బళ్ళ ధాన్యం బహుమానంగా లభించింది. ఆ యేడే రంగపురి రైతులు ఉత్తరపు భూమిని బాగుచేసి, దున్ని, పంటలు వేశారు. అటుతరవాత రంగపురి దారిద్ర్యం క్రమంగా తీరిపోయింది.



# ప్రకృతి వింతలు



## సముద్రపు ఏనుగు!

సముద్ర జలంలో నివసించే జంతువులన్నిటిలోకీ చాలా పెద్దది తిమింగిలం. అయితే సీల్ అనే జలచరాన్నే 'సముద్రపు ఏనుగు' అని అంటారు. ఇది చూడడానికి పెద్ద చేప ఆకారంలో వుంటుంది. మామూలు సీల్ జంతువులే కాకుండా బూడిద రంగు సీల్స్, ఉంగరాల సీల్స్ కూడా ఉన్నాయి. ఈ 'సముద్రపు ఏనుగులు' దాదాపు 6 మీటర్ల (20 అడుగులు) పొడవూ, 4 టన్నుల బరువూ వుంటాయి. పిల్లలు పెట్టడానికి ఇవి తీరానికి వస్తాయి.



## కొమ్మల రక్షణ

సాధారణంగా పక్షులు ఎందుకు చెట్టుకొమ్మల మీదే గూళ్ళు కడతాయని ఆలోచించారా? గుడ్లు పెట్టి, పొదిగాక బయటికి వచ్చే పిల్లలు ఎగర లేవు. వాటికి రక్షణ చాలా అవసరం. ఇతర జంతువుల నుంచి వాటికి భద్రత కావాలి. దానికి తగిన చోటు చెట్టు కొమ్మలే. పిల్లులు వంటి జంతువులు చెట్లు కూడా ఎక్క గలవు. కాబట్టి అలాంటి జంతువుల నుంచి కూడా తమ పిల్లలను కాపాడడానికే పక్షులు చిటారు కొమ్మలలో అంటే ఏ జంతువయినా ఎక్కితే కొమ్మ విరిగిపోయేంత సన్నటి రెమ్మల మధ్య గూళ్ళు కడతాయి. అంతే కాదు; ఇతర పక్షుల, జంతువుల కళ్ళపడకుండా సాధ్యమైనంత చాటు ప్రదేశం చూసుకుని మరీ గూళ్ళు కడతాయి!



## రంగులు మార్చే బండ!

ఆస్ట్రేలియాలో 'ఏయెర్స్ రాక్' అనే ఒక విచిత్రమైన బండ వున్నది. అది ఒక రోజులో అంటే సూర్యోదయం నుంచి సూర్యాస్త మయంలోగా అనేక రంగులు మారుస్తుంది. సూర్యుడున్న స్థితినీ, కోణాన్నీ బట్టి ఈ రంగులు మారతాయన్న మాట. ఈ బండ దాదాపు 1200 అడుగుల ఎత్తు ఉన్నది. బండ చుట్టూ సమతల ప్రదేశం వుండడం వల్ల చూడడానికి చాలా గంభీరంగా వుంటుంది. ఐదు మైళ్ళ చుట్టుకొలత గల అడుగు భాగం మామూలుగా ఎర్రగా ఉంటుంది. సూర్యోదయ సమయంలో బండ రగిలే కెంపులా కని పిస్తుంది. సూర్యాస్తమయ సమయంలో ధూమ్రవర్ణానికి అంటే ఊదారంగుకు మారుతుంది. ఈమధ్య కాలంలో పసుపు, నారింజ రంగు ఛాయలను పొందుతుంది. 120 సంవత్సరాలకు పూర్వం కనుగొనబడిన ఈ బండకు నాటి ప్రధానమంత్రి సర్ హెన్రీ ఏయెర్స్ పేరు పెట్టారు.

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.


S.G. SESHAGIRI


S.G. SESHAGIRI

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *సెప్టెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎవరికోసం తల్లీ? రెండవ ఫోటో : ఈ రంగవల్లి!

పంపినవారు : జి.వి. రాఘవేంద్రరావు, టెల్లర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా,
బట్టల బజార్ శాఖ, వరంగల్ - 506 002 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.